

Chandamama, August '51 Photo by N. Ramakrishna

అబ్బో, భలే బరువు




ఆంధ్ర & సీడెడ్: నవయుగ ఫిలిమ్సు, విజయవాడ

మైసూరు: ప్రకాష్ పిక్చర్సు, బెంగుళూరు సిటీ :: నైజాం: కర్నాటక ఫిలిమ్సు లి., బెంగుళూరు సిటీ

ఇతర వివరాలకు:

ప్రకాష్ ప్రొడక్షన్సు :: శాంథోమ్ :: మద్రాసు-4




# చందమామ

సంచాలకుడు: చక్రపాణి


ఒక మైనాపిట్ట మధుర స్వరానికి ముగ్ధుడై, ఒకడు దానిని పెద్దవెలయిచ్చి కొనుక్కున్నాడు. పంజరంలో పెట్టాడు. పంజరంలో పెట్టినప్పటినించీ అది దీనంగా అగుపించింది. క్రమంగా పాడటంకూడా మాని వేసింది. ఇది చూచిన యజమానికి తన జైలు జీవితం జ్ఞాపకానికి వచ్చింది. వెంటనే పంజరం చేతపట్టుకుని ఊరి పొలిమేరకు వెళ్లాడు. పంజరం తలుపు తెరిచాడు. మెడ పైకెత్తి నీలి ఆకాశంకేసి చూచింది మైనా. చుట్టూవుండే మహావృక్షాలు చూచింది. దిగువను కనబడే పచ్చని చేలూ పచ్చికబయళ్లూ చూచింది. ఒక్కసారి రెక్కలు తటతటలాడించింది. అది విశాల ప్రపంచం లోకి ఆకాశమార్గాన ఎగిరిపోతూ పాడిన పాట యజమాని విన్న తుదిపాట ఐంది!—ఇది చూడగా మానవులే కాదు, ప్రతిజీవీ స్వేచ్ఛ కోసం తాపత్రయపడటం స్వభావసిద్ధమై వున్నట్టు తోస్తుంది. స్వేచ్ఛకు విలువ కట్టడమనేది కష్టసాధ్యమైన పని. అది లేని బ్రతుకు బానిస బ్రతుకే. అందువల్లనే, ఒకరి స్వేచ్ఛను మరి ఒకరు అరికట్టడానికి ప్రయత్నించటం మహాపాపమని అంటారు మన పెద్దలు. ఈ సత్యాన్ని నిరూపించేదే, ఈ నెల చిట్టికథలలో బహుమతి పొందిన 4-వ కథ.


సంపుటి 9 :: అగస్టు '51 :: సంచిక 2






# ముందు యోచన

సింహమొక్కటి ముసలితనమున
వేటకెళ్లే శక్తిలేకా
కదలటానికి కాళ్లు రాకా
మనసులో అనుకొన్నదిట్లని.

'నన్నుజూచిన మృగాలేవీ
దగ్గరకు రావాయె నేనో
కదలనైతిని మెదలనైతిని
కడుపుమరి నిండటమెలానో ?'

చివరికిక ఆ ముసలి సింహం
ఒక్క గుహలో దూరి చల్లగ
పొంచుకొన్నది తెలివి తక్కువ
మృగాలొస్తాయనుచు కొల్లగ.

జరిగినది అది తలచినట్లే
మృగాలొచ్చే వొక్కటొకటీ
నిర్భయంగా లోనికెళ్లీ
తిరిగిపోయేది కాదొకటీ !

పూర్వమా గుహ నక్కగారిది
చాల రోజులు యాత్రకెళ్లీ
తిరిగివచ్చిందామె తన గుహ
లో నివాసం కొరకు మళ్లీ.

రచన:
"బైరాగి"

కాని నక్కకు తెలుసు తొందర
పనికిరాదని ఎందులోనూ.
అది అరణ్యం కటికి చీకటి
గుహ ప్రమాదం అందులోనూ.

అందుకని అది ఆగి కొంచెం
చుట్టుప్రక్కల కలియచూసీ
నిలచిపోయిం దకస్మాత్తుగ
అడుగు ముందుకు ఒకటి వేసీ.

మృగాలేవో లోనికెళ్లిన
గురుతులక్కడ కానవచ్చాయ్
గురుతులన్నీ ఒక్కటొకటే
తుదకు గుహకే దారి తీశాయ్.

లోనికెళ్లిన గురుతులన్నీ;
బయటకొచ్చిన గుర్తు ఒక్కటి
లేదు అక్కడ! నక్కకంతా
అర్థమయ్యిం దసలు సంగతి.

నక్క వచ్చిన దారివెంటే
తిరిగిపోయిం దప్పుడే ఇక.
తప్పుకొన్నది అపాయాన్నీ
ముందుయోచన చేసి ఇంచుక.








బడి గంట పదీ కొట్టింది. లెక్కల మాష్టరు క్లాసులోకి వచ్చారు. 'నిన్నను యిచ్చిన లెక్కలు చేసుకువచ్చారా?' అని విద్యార్థులను అడిగారు. ఎవళ్లూ చేసుకురాలేదు. అందుకని ఆయన ఏంచేసిపోతాడోనని భయపడుతూవున్నారు. ఒక్క పిల్లవాడు మాత్రం చేసి తీసుకవచ్చాడు. ఆ పిల్లవాడికి రైటు వేసి కూర్చోమని, తక్కినవాళ్లనందరినీ మెత్తగా తన్ని బెంచి యెక్కించాడు మాష్టరు. వాళ్లందరూ ఏడుస్తున్నారు. వాళ్లతోపాటు లెక్కలు రైటు చేసుకువచ్చిన పిల్లవాడుకూడా ఏడవనారంభించాడు. ఇది చూచి మాష్టరుకు ఆశ్చర్యం వేసింది. 'నువ్వెందుకురా అబ్బాయీ, ఏడుస్తావు? లెక్క రైటు చేశావు కదా!' అని ప్రశ్నించాడు.

అందుకు ఆ పిల్లవాడు 'ఈ లెక్కలు నాకూ తెలియవండి. మా పెద్దన్నయ్యా చేసిపెట్టాడండి. లేకపోతే నా తోడిపిల్లలతోపాటు నేనూ దెబ్బలు తిని, బెంచీ ఎక్కవలసినవాడనే," అని చెప్పాడు.

జంకుగొంకులు లేకుండా అంత ధైర్యంతో ఉన్నది ఉన్నట్టు చెప్పిన ఆ పిల్లవాని సత్యసంధతకు మాష్టరు చకితుడైనాడు. పిన్నవయసులోనే ఇటువంటి సుగుణం కలిగివున్న ఆ విద్యార్థి, ముందు ముందు గొప్ప మార్గదర్శకుడై, కుటుంబానికీ దేశానికీకూడా కీర్తి తీసుకువస్తాడని నిశ్చయించుకొన్నాడు.

మాష్టరు దీవించినట్టే ఆ పిల్లవాడు దినదిన ప్రవర్ధమానుడై, గొప్ప ప్రయోజకుడై, భారత ప్రభుత్వానికి కుడిభుజమై, ప్రజారంజకుడై వాసికాంచినాడు. ఆ మార్గదర్శకుడే దేశారాధకునిగా ప్రకాశించిన గోపాలకృష్ణ గోఖలే.



# మంత్రం-తంత్రం

చవుటుపల్లిలో శంకరయ్యకు ఒక చిన్న ఇల్లున్నది. ఇల్లు చూడబోతే చిన్నదే కాని, ఇంటి పెరడుమట్టుకు చాలా పెద్దది. ఈ పెరడునిండా కశింద, బ్రహ్మమేడి, బరిణిక, జిల్లేడు—ఒకటేమిటి? నానారకాల చెట్లూ తుప్పలూ దుబ్బులూ పొదలూ బలిసిపోయి, అదంతా ఒక చిన్న అరణ్యంలాగా తయారైంది. ఇలా తయారు కావటంవల్ల ఆ పెరడు పట్టపగలే చీకటిగా వుండేది. అటువంటి పెరడులో పురుగూ బుట్రా మసులుతున్నదంటే ఆశ్చర్యం దేనికి?

అతని క్షేమం కోరిన ఇరుగుపొరుగులు అడపా తడపా చెబుతూనే వచ్చారు: "అబ్బాయీ, శంకరం! పిల్లాజెల్లా తిరుగుతూవుంటారు. పదిరూపాయలు పోతయ్యాని చూడక పెరడు శుభ్రం చేయించు, గోడగంతలు పూడ్పించు. తరవాత ఏమనుకుంటే యేముంది?" అంటూ. ఆ తిక్క శంకరయ్య వింటేనా?—ఊళ్లో వాళ్లు చెప్పి చెప్పి నోరు నొచ్చి, మనకెందుకని ఊరుకున్నారు.

ఒకరోజున శంకరయ్య, భార్యాపిల్లలూ భోజనాలకు కూర్చున్నారు. గది తూములోనించి చిన్న కప్ప ఒకటి లోపలికి వచ్చింది. అది గెంతుతూవుంటే పిల్లలు వినోదంగా చూడసాగారు. అంతలోనే ఒక పాము చరచరమని పాకుతూ వచ్చి కప్పను పట్టబోయింది. విస్తరిముందు భోజనాలు వదిలేసి, ఎక్కడవాళ్లక్కడే లేచి పరుగెత్తారు.

అందరూ పరుగులెత్తారు కానీ, శంకరయ్య మాత్రం చాటునే పొంచివుండి పాము నడక కనిపెడుతూనే వున్నాడు. అది వెనకపాటునే వెళ్లి కప్పను పట్టేసింది. ఆ గదిలోనించి తప్పించుకు పోయేందుకు మరిఒక మార్గం లేదు. అందుకని ఆ పాము వచ్చినదారినే మెల్లగా జారుకుంది.

యం. చిట్టిబాబు, పరశువాకం



యింట్లోకి !!!" అన్నాడు ఆత్రంకొద్దీ, శంకరయ్య.

"ఎందుకు బాబూ, అలా కంగారు పడతవు? నేనుండగా నీకు భయమేంటి? అదేం పాము? ఎంత పొడుగుంది? చుక్కలున్నయ్యా, చారలున్నయా?"... అంటూ లక్ష ప్రశ్నలు వేయసాగాడు నాగన్న.

"అపదసమయంలో ప్రశ్నలేమిటిరా?" అంటూ వేగిరపెట్టాడు శంకరయ్య.

"అది కాదు బాబయ్యా! నేను నాగస్వరం పాడి పిలుస్తాను. మంత్రం వేస్తాను. పాములొస్తయి. వాటిల్లో నువు చెప్పిన పాము ఉన్నదా, ఎన్ని పాములొస్తే అన్ని పావలాలు ఇచ్చుకోవాలి. నువు చెప్పిన పాము రాలేదనుకో, ఒక పావలా డబ్బు లివ్వు నా కష్టానికి, చాలు" అని చెప్పాడు, నాగన్న.

శంకరయ్య ఇదంతా చూస్తూనేవున్నాడు. అది పోయి పోయి ఒకానొక గోడకలుగులో దూరిపోయింది. దృష్టి తప్పకుండా గమనిస్తూనే వున్నాడు శంకరయ్య.

ఇంతలో వాళ్ల గోల విని, పదిమందీ పోగయ్యారు. 'పాము ఎటుపోతుందో జాగర్తగా చూస్తూవుండండి అబ్బాయ్!' అని అక్కడివాళ్లకు చెప్పి, తను పాముల వాడింటికి బయలుదేరాడు. అదృష్టం బాగుండి, శంకరయ్య వెళ్లేసరికల్లా పాముల నాగన్న ఇంటిదగ్గరే వున్నాడు.

"రారా నాగన్నా! ఇంకేముంది, కొంప మునిగింది!! పెద్ద పామొచ్చింది మా

పామును బాగా పరకాయించే చూచాడు శంకరయ్య. అందుకని అతనికి దాని ఆనవాళ్లు జ్ఞాపకం లేకపోలేదు. ఐనా, యిప్పుడు నాగన్న చెప్పిన మాటమీద తీరా నాగస్వరం ఊదగానే కలుగులోనించి ఎన్ని పాములు వస్తాయో, ఇంతాచేసి అన్నింటికీ

అన్ని పావలాలు ఇవ్వవలసివస్తుందేమో. ఇంతకూ ఒకవేళ తన యింటికి వచ్చిన పాము బయటికి వస్తుందో రానేరాదో అని సంశయం పట్టుకుంది. ఈ సంశయంతో తను చూచింది చూచినట్టుగాక మరొక విధంగా పామును వర్ణించి చెప్పాడు.

నాగన్న వెంటనే బయల్దేరి వచ్చాడు. నాగస్వరం వూదాడు. అమాంతం ఐదారు నాగులు వచ్చాయి. వాటిలో శంకరయ్యా చెప్పిన పాముమాత్రం లేదు. అందుచేత వాటిని పట్టి బుట్టలోనికి నెట్టాడు. మళ్లీ వూదాడు. ఎంతసేపు ఊదినా, శంకరయ్యా చెప్పిన పాము రానేలేదు. తన పాచిక పారినందుకు సంతోషిస్తూ శంకరయ్యా ఒక పావలా డబ్బులిచ్చి వాడిని పొమ్మన్నాడు.

"ముప్పై యేళ్లనించీ నేను పాములు పట్టుతున్నాను. ఒక్కమాటుకూడా నా అంచనా తప్పిపోలేదే. అలాంటిది ఇప్పుడిలాగా ఎందుకయిందా?" అని అనుమానించాడు నాగన్న. ఇది డబ్బులివ్వబడుతుందని శంకరయ్యా చేసిన పన్నాగమే కాని మరొకటికాదు, అని రూఢిపరుచుకున్నాడు. శంకరయ్యాయిచ్చిన పావలా డబ్బులు పుచ్చుకొని వెళ్లిపోతూ నాగన్న,




'నువు నన్ను మోసం చేసినట్టుంది. అది వూరకే పోదు. పాములు నోరులేని జీవాలనుకుంటున్నావల్లే వున్నది. వాటివిషయంలో అబద్ధం చెప్పి ఎవడూ బాగుపడలేదు. మా పాములు పవిత్రమైనవి. వాటితో చెలగాటం పనికిరాదు. మోసగాళ్ళను అవి క్షమించవు. నీవుచేసిన మోసానికి తగ్గ ప్రతిఫలం త్వరలోనే అనుభవిస్తావు" అంటూ చరచర వెళ్లిపోయాడు.

"ఏడిశాడు" అనుకున్నాడు మనస్సులో శంకరయ్యా.

మరునాడు మళ్లీ రెండు నాగుపాములు పడగలెత్తుకొని, బుసలు కొట్టుకుంటూ,

శంకరయ్యా పెరట్లో మసలజొచ్చినై. ఈ సారి ఇంట్లోవాళ్ల కంగారుకు అంతులేక పోయింది. ఏంచేయటం? శంకరయ్యా ఉరుకులెత్తుకుంటూ పోయి నాగన్నను రమ్మని బ్రతిమలాడాడు. "ఇప్పుడు ఐదు రూపాయల బేరమున్నది బాబూ, పోవాలి. ససేమిరా రావటానికి వీల్లేదు" అనేశాడు నాగన్న నిర్మొగమాటంగా. చివరకు కాళ్లా వేళ్లా పడి శంకరయ్యా ఆ అయిదు రూపాయలూ తనే యిచ్చుకుని వాడిని వెంట తీసుకవచ్చి ఆ రెండు పాములనూ పట్టించాడు.

సరిగా ఇది జరిగిన వారంరోజులకల్లా అతని స్నేహితుడు బుచ్చిబాబు వచ్చి కుశలప్రశ్నలు వేయసాగాడు. ఇంకా నలుగుతూనేవున్న పాముల పురాణాలు ఇంటిల్లిపాతీ పూసగుచ్చినట్టు చెప్పుకొని వచ్చారు. వాళ్లు చెప్పినదంతా శ్రద్ధగా విని బుచ్చిబాబు పకపక నవ్వసాగాడు. అతని నవ్వు వాళ్లకేమీ అర్థం కాలేదు. చివరకు ఇలా అన్నాడు బుచ్చిబాబు: "ఏమిటోయ్ శంకరం బావా! వట్టి పిచ్చి వాడిలాగా ఉన్నావే! ఇన్నాళ్లనించీ ఈ వూళ్లో వుంటూ మన నాగన్న సంగతే తెలియదా? వాడేవో షరతులు చెబుతాడు. ఆప్రకారం డబ్బివ్వక తంత్రం చేస్తారు కొంతమంది. అందుకని అటువంటివాళ్ల పెరట్లో మంత్రం వేసి పాముల్ని వదిలేస్తాడు. తెలుసునో లేదో, అవి కోరలు తీసిన పాములే సుమా! అందుకని వాటివల్ల ప్రమాదం లేదు కాని భయంమాత్రం వేస్తుంది. ఇంతకూ నాగన్న కేమైనా డబ్బులు నాని చేశావేమిటి?" అని పరిహాసం చేశాడు.

తన తప్పిదానికి సిగ్గుపడి ప్రసంగం తప్పించివేశాడు, శంకరయ్యా.






## 14

[బావిలో పడిన ఉదయనుడు బైటపడటం, గెడ్డపువాడిని శ్రావస్తికి పంపటం, వాడు ఎంతకూ తిరిగి రాకపోగా తనేబయలుదేరి వెళ్ళి రాజుకి శుభవార్త అందించటం, తిరిగి వచ్చేసరికి తన సోదరులను రాక్షసుడు ఉరితీయబోతూవుండటం వరకు చదివారు]

ఆ భయంకర దృశ్యం చూచి ఉదయనుడు గజగజలాడిపోయాడు. ఏమి చెయ్యటానికీ పాలుపోలేదు. పోనీ అదృశ్యరూపం పొంది వాళ్లని విడిపిద్దామన్నా వీలులేని పరిస్థితి ఏర్పడింది. ఎందువల్లనంటే శ్రావస్తినుండి తిరిగి వచ్చేటప్పుడు దురదృష్టవశాత్తు తెల్ల భస్మం కాస్తా పోగొట్టుకున్నాడు. అందుచేత తన సోదరులూ వాళ్లూ మరొక్క క్షణంలో ఉరితీయబడతారని తెలిసికూడా ఉదయనుడు చాటుని పొంచిచూస్తూ వుండిపోవలసివచ్చిందేకాని మరోమార్గం కనుపించలా. ఉదయనుడికి ముచ్చెమటలు పోసినై. క్షణమొక యుగంలా గడుస్తోంది. పోతే, అక్కడ అప్పుడే రాక్షసుడు వాళ్లను చెట్టుదగ్గరకి తీసుకువెళ్లాడు. ఉరి త్రాళ్లు తగిలించివేశాడు. చాటున ఉన్న ఉదయనుడు ముందుకు ఉరకబోయే టంతలో 'అగు' అనే కేక వినిపించింది.

విస్తుపోయి చూచాడు ఉదయనుడు. ఆ కేక పెట్టినది ఎవరు ? గెడ్డపువాడే. వాడు రాక్షసుడితో యిలా చెబుతున్నాడు: "వీళ్లని రక్షిద్దామనే ఉద్దేశ్యంతో యిన్నాళ్లూ ఒక రహస్యం నీతో చెప్పకుండా దాచాను. కాని అది దాచికూడా వీళ్లని రక్షించలేక పోయాను. పైగా యిప్పుడు నా ప్రాణానికే ముప్పు వచ్చింది. కనుక, ఇక దాచను,




ఇంత కాలమూ నిన్నూ నన్నూ మోస పుచ్చుతూ వచ్చిన ఈ ముగ్గురు కుర్ర వాళ్లూ కవలలు" అని యింకా ఏమో చెప్పబోతుండగా రాక్షసుడు,

"ఏమిటీ! కవలలా? మళ్లీ నన్ను మోస పుచ్చటానికి చూస్తున్నావల్లే ఉందే! వీళ్లు కవలలే అయినట్టయితే, నాకా చిక్కకుండా పోవటం?" అన్నాడు.

అప్పుడు గెడ్డపువాడు "నిజమే. నీవు కావాలనే వీళ్లను వదిలేశావు" అంటూ, కవలసోదరుల దృష్టి లోపాలను గురించీ దానిని తను సరిచేయడాన్నిగురించీ అంతా తెలియచేశాడు గత్యంతరం లేక.

అంతావిని రాక్షసుడు, 'బలికి కావలసిన యాభైమంది కవలలూ సమకూరినట్టే కదా? నీవు చెప్పిందంతా నిజమేనని నమ్మవలిసిందేనా? వీళ్లు కవలలు అవునో కాదో ఎలా రూఢి అవుతుంది? వాళ్లనే అడుగుతా' అని చెప్పి సంధ్యా నిశీథులవైపు తిరిగాడు.

"మా వాడు చెప్పిందంతా నిజమేనా? నిజం కప్పిపుచ్చినా మీ ప్రాణాలు దక్కవు. కనుక అబద్ధమాడకండి. నిజంగా మీరు కవలలే అయినట్టయితే ఒక మహత్తరమైన కార్యంకోసం ప్రాణాలర్పించామనే తృప్తి అయినా వుంటుంది మీకు" అన్నాడు.

ఇందుకు సంధ్యానిశీథులు "నిజమే" అన్నారు కన్నీరు కారుస్తూ.

పొంచివున్న ఉదయనుడు నిశ్చేష్టుడై పోయాడు. నమ్మి గెడ్డపువాడిని ప్రాణాలతో వదిలినందుకు యిదా ఫలితం అనిపించింది. వాడిని ఆమట్టున నరికిపారేద్దామా అనుకున్నాడు. కాని అంతలోనే రాక్షసుడి గొంతు వినిపించింది.

"అయితే ఆ మూడోవా డేడీ?" అని రాక్షసుడు ప్రశ్నించాడు.

అందుకు గెడ్డపువాడు, "వాడు యింటికి పోయివస్తానని చెప్పి వెళ్లి యిప్పటికి వారం

రోజులైంది. ఈపాటికి తిరిగి రావలసిందే. దారిలో ఏదైనా ప్రమాదం సంభవించిందో, యేమో! ఇంతలో వస్తాడనే నమ్మకంకూడా నాకులేదు" అన్నాడు.

"సరే. ఆలస్యం ఎందుకు. రేపే బలి పూర్తి చేసి, దేవిని ప్రసన్నం చేసేసుకుంటాను. ఏర్పాట్లన్నీ చేయాలి. నిన్ను నమ్మి వదులుతాననిమాత్రం అనుకోకు" అంటూ రాక్షసుడు గెడ్డపువాడినీ, సంధ్యానీధులనూ, రాజభటులనూ ఒక్కొక్కళ్లను ఒక్కొక్క చెట్టుకి అంటగట్టి, పెద్దపెట్టున నవ్వుతూ గెద్దరూపంలో ఆకాశమార్గాన ఎగిరిపోయాడు.

రాక్షసుడు వెళ్లీ వెళ్లడంతోనే ఉదయనుడు కత్తిదూసి ఒక్క పరుగున గెడ్డపువాడున్న చెట్టువద్దకు పోయి, వాడిని నరకబోయాడు.

"ఆగు. తొందరపడకు. నేను చెప్పేది పొంతంగా విని ఆపైన నీ యిష్టం వచ్చినట్టు చెయ్యి" అన్నాడు.

"వినేదేమిటి. విన్నదిచాలు. ప్రాణాలతో వదిలినందుకు బాగా చేశావు. నిన్నేంచేసినా పాపంలేదు. ఇంకా ఆగమంటావేమిటి?" అంటూ హుంకరించాడు ఉదయనుడు.



"అబ్బాయీ! నీవు యిలా అపోహపడటంలో ఆశ్చర్యం లేదులే. ఐనా చెప్పేది విను: ఈ క్షణానికి తప్పించుకుని బైట పడితే చాలుననే ఉద్దేశంతోనే నేను వాడికి మీ జన్మరహస్యం చెప్పవలసి వచ్చింది. తప్పించుకోటానికి మరో మార్గం లేదు. నా స్థానంలో నీవున్నా మరేమీ చెయ్యలేవు. నా ఉపాయం పారింది. రేపటివరకూ వాడు ఆగటం నిజంగా మన అదృష్టమే" అన్నాడు గెడ్డపువాడు.

ఉదయనుడు ఆలోచనలో పడ్డాడు. కొంచెం పస్తాయించి, "సరే, నిన్ను నమ్మామే అనుకో, తెల్లవారేలోగా వాడికి



చిక్కకుండా మనమందరం తప్పించుకోవటం ఎలా?" అన్నాడు.

అప్పుడు గెడ్డపువాడు, "అదీ ఆలోచించా. చెప్పుతా. ముందు వీళ్ల కట్లుకూడా విడిపించుదాం పద" అంటూ సంధ్యా నిశీథులనూ, రాజభటులనూ విడిపించాడు. తర్వాత వాళ్లని వెంటబెట్టుకుని కొలను దగ్గిరికి వెళ్లాడు. వీళ్ళని చూస్తూనే మన రాకుమార్తెలు ఒడ్డుకి వచ్చేశారు.

గెడ్డపువాడు ఉదయనుడిని చూచి, "ఆ ఎఱ్ఱ అంజనం యిలా తే" అన్నాడు.

రాకుమార్తెలను దగ్గరకు రమ్మని పిలిచాడు. వాళ్లు వచ్చాక ఆ ఎర్ర అంజనం తీసి సుహాసిని భుజానికి రాచాడు. వెంటనే ఆమె చెయ్యి మాయమైంది. తర్వాత సుభాషిణిని కూర్చోబెట్టి మోకాలిదగ్గర రాచేసరికి ఆమె కాలు మాయమైంది. మరి కాస్త అంజనం తీసి సుకేశిని కళ్లకు రాచాడు. దానితో ఆమె కళ్లు రెండూ పోయాయి. ఈవిధంగా రాకుమార్తెలు ముగ్గురికీ అంగవైకల్యం కల్పించటంచూచి ఉదయనుడు "ఏమిటీ దారుణం, ఏదో ఉపాయం చెబుతానని చెప్పి యిదా నువు చేసే పని" అని ఉగ్రుడైపోయాడు.

"ఎంతకూ నీ తొందరపాటు మాత్రం మానవుకదా? అన్నింటికీ అలా అనుమానపడతావేమిటి?" అంటూ గెడ్డపువాడు ఉదయనుడి చెవిలో ఏదో చెప్పాడు.

ఉదయనుడు కొంత తృప్తిపడి, "మరి, ఇంత కాలం ఏవిధమైన అవయవ లోపమూ లేకుండావుండి, రేపు వాడు వచ్చి చూచేసరికల్లా ఇలా జరిగితే వాడు నీపైన అనుమానపడడా? దీనివల్ల మనకు కలిసి వచ్చేదేముంది?" అని అడిగాడు.

"అదంతా తర్వాత చూదాం. ప్రస్తుతం యింతకంటే మార్గం లేదు. రేపు వాడు వచ్చేవేళకి మేము ఎప్పటిలాగా చెట్లకు

కట్టివెయ్యబడి వుంటాం. నీవు మాత్రం భస్మం చల్లుకుని అదృశ్య రూపంలో వుండి ఏమి జరుగుతుందో కనిపెడుతూ వుండు" అన్నాడు గెడ్డపువాడు.

ఉదయనుడు తెల్లబోయాడు. "ఆ భస్మమే వుంటే యిన్ని పాట్లెందుకు వస్తయ్. శ్రావస్తినుండి వచ్చేటప్పుడు అది కాస్తా పోగొట్టుకున్నాను." అన్నాడు సిగ్గు పడుతూ.

"ఏమిటీ? పోగొట్టుకున్నావా? ఫరవా లేదులే. నీవు మాకు యిచ్చి వెళ్లిన భస్మం మేము వాడలేదు. ఇదుగో" అంటూ పొట్లం తీసి యిచ్చాడు.

ఆ తర్వాత ఉదయనుడు వాళ్లని మళ్లీ ఎప్పటిలా చెట్లకు కట్టివేసి, తను అదృశ్య రూపంలో వుండిపోయాడు.

* * *

మరునాడు, తెలతెల్లవారుతూ వుండగా సుడిగాలి ప్రారంభమైంది. రాక్షసుడు వస్తున్నాడుకదా అనుకున్నారు అందరూ. సంధ్యా నిశీధులూ, గెడ్డపువాడూ రాజ భటులూ ఎంతో అలిసిపోయినవాళ్లలా చెట్లకి జేరగిలబడి వున్నారు. మరి కొద్ది సేపటికల్లా రాక్షసుడు రానేవచ్చాడు. అతని



వెంట గండ్రగొడ్డళ్ళు భుజాన వేసుకున్న యిద్దరు భటులు వస్తున్నారు. ఆ వెనక ఎంతోమంది పరివారం పూలదండలతో నడిచి వస్తున్నారు.

సంధ్యా నిశీధులున్న చోటికి చేరుకుంటూనే రాక్షసుడు తనకు ఏర్పరచిన సింహాసనంపైన అధిష్ఠించాడు. "కొలనులో కపలలందరకూ స్నానాలు చేయించి, దివ్యంగా అలంకరించి ఒక్కొక్కళ్లనే తెచ్చి, నా ఎదట నిలబెట్టండి" అని పరివారానికి ఆజ్ఞాపించాడు.

వెంటనే ఎవరి పనులలో వారు నిమగ్నమై పోయారు. ఒకరు స్నానాలు చేయిస్తున్నారు.

మరొకరు వస్త్రాలు అలంకరిస్తున్నారు. అలంకరణ పూర్తిఐనవారినల్లా రాక్షసుడి యెదుట నిలబెట్టుతున్నారు. రాక్షసుడు బ్రహ్మానందభరితుడవుతున్నాడు. తన ఎదుట తెచ్చి నిలబెడుతున్న రాకుమార్తెలను, రాకుమారులను చూస్తూ, "నీవు కనకపురి రాకుమార్తెవుకదూ? నీవు అవంతీశ్వరుని అందాలభరిణెవు కదూ? నీవు మణిపుర రాకుమారుడవు కదా?" అంటూ పేరుపేరున పరామర్శిస్తూన్నాడు. పాపం వాళ్లు తలలు వంచుకొని కన్నీరు మున్నీరుగా విలపిస్తున్నారు.

ఇంతలో ఒక పరిచారిక మరొక రాకుమార్తెను తీసుకువచ్చి నిలబెట్టి, "ఇదేమిటి ప్రభూ! ఈగుడ్డిదాన్ని తెచ్చారే, దేవి స్వీకరిస్తుందా?" అన్నది.

రాక్షసుడు నివ్వెరపోయి, "ఏమిటీ? గుడ్డిదా?" అంటూ సింహాసనం దిగి ఆ రాకుమార్తెను పరిశీలించబోయేటంతలో మరో పరిచారిక, "ఈ కుంటిదాన్ని తెచ్చారేమిటి? ప్రభూ" అంటూ తను తెచ్చిన రాకుమార్తెను రాక్షసుడి ఎదుట వుంచింది.

రాక్షసుడు కోపం పట్టలేకపోయాడు. కళ్లెంట నిప్పులుగక్కుతూ — "మోసం!



ద్రోహం!" అని భూమ్యాకాశాలు దద్దరిల్లే టట్లు అరిచాడు.

ఇంతలో మరో పరిచారిక, "ఈ రా కుమార్తెకు కళ్లేలేవు మారాజా!" అంటూ తనవెంట తెచ్చిన రాకుమార్తెను రాక్షసుడికి చూపించింది.

రాక్షసుడి కోపం మిన్నుముట్టింది. ఒక్క ఉరుకున గెడ్డపువాడిదగ్గరికి వెళ్ళి చెట్టుతోసహా పెళ్లగించాడు. గెడ్డపువాడివంక చూచి, "ఏమిటీ ద్రోహం! లక్షణమైన కవలలను తెచ్చి కొలనులో వేశానే. ఇప్పుడీ కురూపులెక్కడినించి వచ్చారు? ఇది నీ పనే. ఉన్నది వున్నట్టు చెప్పుతావా, లేక ముందు నిన్నే యిక్కడ బలి ఇచ్చేయ మంటావా?" అని గద్దించాడు.

తొణకలేదు గెడ్డపువాడు. "కేకలవల్ల ప్రయోజనంలేదు. ఈ పని నేను చేశానని కదూ, నీ అనుమానం? ఒక్క క్షణం ఆగి, చెప్పేదంతా విను. ఆపైన నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి" అన్నాడు కరుకుగా.

"చాల్లే. యేర్పాట్లన్నీ సిద్ధం చేసుకు వస్తే అవన్నీ మంటగలిపావు. అవేదో త్వరగా అఘోరించు" అన్నాడు, ఆ చెట్టుని అమాంతం కింద పడవేస్తూ.



"వాళ్లకి ఈ అంగవైకల్యం ఎలా ఏర్పడిందో నాకూ తెలియదు. ఐతే, ఒకలాగా జరిగివుండవచ్చని నాకు తోస్తున్నది. ఇలా చేయగలిగిన ప్రజ్ఞ తప్పించుకుపోయిన ఆ ఉదయనుడికే వున్నది. కవలలకు నేను దృష్టిలోపం పోగొట్టినప్పుడు ఈ రహస్యం కాస్తా చెప్పివేశాను. అందుకు కావలసిన అంజనాలూ అవీకూడా వాడివద్దనే వుండిపోయినై. వాడు బ్రతికేవుంటే ఎప్పుడో ఒకప్పుడు నీకు చిక్కకపోడు. అప్పుడు వాడి చేతనే వీళ్లకి మళ్ళీ ఈ అంగవైకల్యం పోగొట్టించవచ్చు. అప్పటివరకూ ఈ కుర్రవాళ్లను బంధించి వుంచు. ఇదే నేను నీకు చెప్పగల సలహా. తరువాత నీ యిష్టం" అన్నాడు.

"సరే కానివ్వు. ఈసారి వాడు చిక్కాడా, చచ్చాడన్న మాటే! ముందు మీ సంగతి చూడాలి. పదండి" అంటూ రాక్షసుడు సంధ్యానిశీథులనూ, రాజభటులనూ, గెడ్డపువాడినీ ఒక్క త్రాటితో బంధించి తన వెంట లాక్కుపోయాడు.

ఇదంతా చూస్తూ ఉదయనుడు రాక్షసుని వెంబడిస్తూనే వున్నాడు. కొద్దిదూరం పోయి రాక్షసుడు ఒక ఆకులగుట్టదగ్గిర ఆగాడు, గెద్దరూపం పొంది విశాలమైన తన రెక్కలను విసురుగా ఆడించేసరికి ఆ ఆకులన్నీ చెల్లాచెదరైపోయి ఆ చోట భూమిలోకి ఒక ద్వారం ఏర్పడింది. రాక్షసుడు సంధ్యానిశీథులనూ, గెడ్డపువాడినీ, భటులనీ ఆ ద్వారంగుండా లోపలికి త్రోశాడు. వెంటనే మళ్లీ ఆకులు కూడదీసి ద్వారం మూసివేసి, కొలనువద్దకు వచ్చాడు.

అలంకరణ పూర్తిఅయిన కవలలను జాగ్రత్తగా చూస్తూవుండమని అక్కడి పరిచారకులనూ భటులనూ హెచ్చరించాడు. అంగవైకల్యం ఏర్పడిన సుహాసినీ, సుభాషిణీ, సుకేశినీలను ఎత్తుకొని గెద్దరూపంలో ఎగిరిపోయాడు. —[ఇంకా వుంది]






రామన్నపాలెంలో ఒకయింట అరుగుపైన రంగన్న అనే మూడవతరగతి పిల్లవా డొకడు తెనుగుపాఠపుస్తకం తీసి చదువు కుంటున్నాడు. వాడు చదువుతున్నది నక్కమీద పాఠం. 'నక్క జిత్తులమారి జంతువు' అని వాడు గట్టిగా చదివేసరికి, అక్కడికి దగ్గరగానే ఉన్న పొలంలోంచి పోతూన్న ఒక నక్కకి ఆ వాక్యం విన పడింది. తన తెలివితేటలు పుస్తకాలలోకి కూడా ఎక్కిపోయాయని తెలిసి నక్క ఒక్కమారుగా ఉబ్బి తబ్బిబ్బులైంది.

ఆ పక్కనే అటునుంచి ఇటూ, ఇటు నుంచి అటూ వంకరటింకరగా నడుస్తూ వున్న ఒక పీత నక్కనిచూసి, 'ఏమిటి బావా, విశేషం? మంచి హుషారుగా ఉన్నావే!' అని అడిగింది.

'ఇంతకన్నా ఏంవిశేషం కావాలి పీతా? ఆ అరుగుమీద కూర్చుని చదువుతూన్న కుర్రవాడి పాఠం వినపడటంలేదా నీకు? నేను 'తెలివైన జంతువు'నని మనుషులు కూడా తమ పుస్తకాల్లో రాసేసి మెచ్చు కుంటున్నారు!' అని నక్క ఒక్కమాటు గర్వంగా తోక ఝాడించింది.

"నేను మర్యాదగా 'బావా' అని పిలిస్తే నన్ని నక్క 'పీతా!' అని పిలుస్తోంది. మనుషులు మెచ్చుకుంటున్నారని దీని కెంత గర్వంగా ఉంది! దీని పొగరు అణ చాలి!" అనుకుంది పీత.

ఇలా అనుకొని పీత, "అది సరేగాని బావగారూ, 'జిత్తులమారి' అంటే 'మోస కారి' అని అర్థం కదా! ఇది మెచ్చుకోడం ఎలా ఔతుంది?" అంది.

ఇది వినేసరికి నక్కకి కోపంవచ్చి 'పీతా నీ కెంత అసూయ! లేని అర్థాలు తీసి మెప్పును దెప్పుగా మార్చేసి చెబుతు న్నావే!' అంది.

టి. సుబ్బరాజు - న్యూఢిల్లీ



పీత చిరునవ్వుతో, "బావా! నువ్వు తెలి వైనవాడివే కావచ్చు కాని నీకంటే తెలి వైన వాళ్లుకూడా ఉండొచ్చు!' అంది.

నక్కకికోపం ఎక్కువై, 'ఏమిటి? నా కంటే తెలివైనవాళ్లున్నారా?' అంది.

'లేకేమి? మేమే' అన్నది పీత.

'ఏమిటీ? తిన్నగా సూటిగా నడవటం చేతకాక అడ్డ దిడ్డంగా నడిచే పీతలా నక్కలకన్న తెలివైనవి!' అంది నక్క.

అణిచేసుకున్న నవ్వుతో పీత, "బావా, మేమేగనక సూటిగా నడిచిపోతే మాతో సమంగా ఏ జంతువు రాగలదు?" అని చమత్కారంగా సమర్థించుకుంది.

'ఈ కబుర్లకేం లేవోయ్!' అంది నక్క.

'కబుర్లు కావు. కావలిస్తే పందెం వెయ్యి నువ్వు. మనలో ఎవ రెక్కువ వేగంగా వెళ్ల గలరో తెలిసిపోతుంది!' అన్నది పీత.

పీత ఇంత ధైర్యంగా చెప్పేసరికి నక్కకి ఆశ్చర్యంవేసి, 'సరే, ఐతే మనం ఇద్దరం ఆ పొలంలో ఈ గట్టునుంచి ఆ గట్టువారా పరుగెత్తుదాం, నీపస తేలిపోతుంది!' అంది. సరేనని ఒప్పుకుంది పీత.

పీతా నక్కా పొలం మొదటిగట్టువద్దకు పోయాయి. 'సరిగ్గా ఒకళ్లపక్కన ఒకళ్లు నిలబడాల'ంది నక్క.

'అలాకాదు, నీకంటే నేను ఎక్కువ వేగం కలదాన్ని గనక నేను కాస్త వెనక నున్నా ఫరవాలేదు.' అంటూ పీత నక్క వెనకాల నిలిచింది.

'మన ఇద్దర్లో ఎవరు పందెం గెలిచిందీ చెప్పటానికి మధ్యవర్తి ఎవరైనా ఉండ వద్దా?' అంది నక్క.

ఆ సమయానికి కాకమ్మ అలా పోతూ కనపడేసరికి పీత దాన్ని ఆపి, 'కాకమ్మక్కా, ఒక్క క్షణం అవతలగట్టుమీద ఆగి మా కోసం ఎదురుచూస్తూ. మాలో అక్కడికి ఎవరు ముందు చేరుకున్నదీ చెప్పి, పోదు

గాని' అని వేడుకుంది. కాకమ్మ, 'సరే' అని ఎదురుగట్టుపైన వాలింది.

నక్క, 'వన్, టూ, త్రీ' అని పరుగుచ్చుకుంది. పీతమాత్రం పరుగెత్తలేదు. అది చేసినదల్లా నక్క 'త్రీ' అనేసరికి ఒక్క ఎగురు ఎగిరి తన డెక్కలతో నక్క కుచ్చుతోక కొసను కరిచి పట్టుకుంది.

నక్క అవతలిగట్టున కాకమ్మవద్దకు ఇట్టే చేరుకుని ఒక్కమాటు వెనక్కతిరిగి, 'పీతా, కోతలు కోశావు! ఏమాత్రం నడిచావు? అంగుళమా? రెండంగుళాలా?' అని హేళనచేస్తూ, పీత ఎంతదూరంలో ఉన్నదీ చూడబోయింది.

నక్క వెనక్కి తిరిగింది. దానితోక కాకమ్మ ముందుకు రావటంతోనే పీత పట్టువదలి కాకమ్మ కాళ్లవద్ద నిలిచి, 'నక్కబావా, ఇంకా వెనకదృష్టిలోనే ఉన్నావేమిటి? నీకన్న ముందే ఇక్కడ చేరుకుని నీకోసం కనిపెట్టుకూచున్నా!' అంది.

నక్క ఆశ్చర్యంతో కాకమ్మవైపు తిరిగేసరికి పీత ప్రత్యక్షమైంది. చేసేదిలేక నక్క, 'పీతబావా, నువ్వే గెలిచావు!' అంది.

పీత, "ఆ, అలాగ మర్యాదగా పిలవటం నేర్చుకో. 'నా అంత తెలివైనవాళ్లు లేరు' అన్న అహంకారం ఎవళ్లకీ పనికిరాదు సుమా. ఇప్పుడైనా తెలుసుకో" అంది.



నక్క నోరెత్తకుండా తోక వాల్చుకుని అక్కడనుంచి మెల్లగా జారింది.

కాకమ్మ జరిగినదంతా పీతవల్ల తెలుసుకుని, 'తమ్ముడూ, ఒకమాటు ఈ నక్క నా సంగీతం వినటానికి వచ్చినట్టేవచ్చి నన్ను మోసంచేసి, నా నోటినుంచి పడిపోయిన మాంసంముక్క ఎత్తుకు పారిపోయింది. నువ్వు చెప్పినట్టుగా, తాడిని తన్నినవాడుంటే, వాడి తలతన్నే వాడూ ఉంటాడు. మంచి బాగా బుద్ధిచెప్పేవు దీనికి' అంటూ తనదారిని తను పోయింది.




సప్తసముద్రాలకు అవతలనున్నది నవ ద్వీపం. ఆ ద్వీపంమధ్యని ఒక కోట. ఆ కోటను అనుకొని పెద్ద తోట, తోటమధ్యని ఒక దివ్య భవనం. భవనంచుట్టూ మానవ మాత్రులు దాట శక్యంకాని ఏడు కందకాలు. భవనంలో వున్నది ఆ ద్వీపాన్ని పాలించే దిలీపమహారాజు కుమార్తె అపురూపసుందరి. రాకుమార్తె ఒక శపథంపట్టింది; "ఎవరైతే సప్తసముద్రాలూ దాటి ఆ కందకాలు దాటి తన భవనం చేరుకోగలరో వారినే వివాహం చేసుకొంటాను" అని. ఇదివిని దేశదేశాలనుండి ఎందరో రాకుమారులు వస్తున్నారు. వచ్చిన వాళ్లు ఆ ఏడు కందకాలలో ఏదో ఒక దానిలో పడిపోతున్నారే కాని ఒక్కరూ నెగ్గటంలేదు.

ఇలా బయలుదేరినవాళ్లలో కుంతల దేశపు రాకుమారుడు కళాధరుడు ఒకడు. అతడు కొయ్య బొమ్మలు చెక్కటంలో అతి నేర్పరి. కళాధరుడు ఒక పెద్ద నావలో బయలుదేరాడు. దారిమధ్యని తుపాను పట్టింది. కళాధరుడు నావను దగ్గరలో నున్న ఒక ద్వీపానికి చేర్చాడు. ఊసుపోక కోసం అతడు తనవద్దనున్న పరికరాలతో కొయ్యచిలుకలు చెక్క నారంభించాడు. ఒకి నూరు చిలుకలు చెక్కాడు. వాటికి చక్కటి రంగులు వేశాడు.

ఇంతలో తుపానుసద్దుమణిగింది. నూరు చిలుకలతోసహా తిరిగి బయలుదేరాడు.

అదే సమయాన బ్రహ్మ ఆకాశమార్గాన పోతున్నాడు. సముద్రమధ్యంలో ఒంటరిగా ప్రయాణం చేస్తున్న కళాధరుణ్ణి చూచి ఆశ్చర్యపోయాడు. అతనికూడావున్న ఆ వంద కొయ్యచిలుకల్ని చూచి, "అహా! ఎంత నేర్పుగా చెక్కాడు, జీవకళ ఉట్టిపడేటట్టు! వీటికి ప్రాణం పోస్తేనో!" అను

ఆర్. పార్థసారథి - తాతానగర్

కున్నాడు. అనుకోవడ మేమిటి? ప్రాణం పోశాడు. వెంటనే కళాధరుడి పడవలోని నూరుచిలుకలూ రెపరెప రెక్కలు కొట్టు కుంటూ ఎగిరిపోయినై.

చిలుకలు యిలా ఎగిరిపోయినందుకు కళాధరునికి ఒకవంక ఆశ్చర్యమూ, మరి ఒకవంక విచారమూ కలిగినై.

ఎన్నో కష్టాలుపడి అతడు ఆరు సముద్రాలు దాటేశాడు. ఏడవ సముద్రంలో ప్రవేశించేసరికల్లా ఇంకొక గొప్ప తుపాను పట్టి పడవ ముక్క ముక్కలైపోయింది. అతడు ఎలాగో తీరం చేరుకున్నాడు.

తను ఏ దేశానికి వచ్చిందీ తెలియక అక్కడ భోగట్టా చేయగా, అదే నవద్వీప మని తెలిసింది. ఉప్పొంగిపోయాడు కళాధరుడు. క్షణమైనా జాగుచేయక సరాసరి రాజువద్దకు వెళ్లాడు.

నవమోహనాకారుడైన కళాధరునిచూచి, రాజు జాలిపడ్డాడు; తన కుమార్తె పట్టిన ప్రతిజ్ఞనుగురించి తెలియజెప్పాడు. ఇందు కోసమై వచ్చిన ఎందరెందరో వీరులూ శూరులూ మడసినారనీ, కనుక అసాధ్యమైన ఈ ప్రయత్నం చేయుటం క్షేమకరం కాదనీ హెచ్చరించాడు.




'నాకు అసాధ్యమనేది లేదు. నా శక్తి సామర్థ్యాలు తెలుసుకునే వచ్చాను' అన్నాడు కళాధరుడు. బ్రహ్మాండమైన సింహద్వారం తెరచి, అతనిని లోనికి వదిలాడు ద్వారపాలకుడు. ద్వారం దాటగానే ఆ ప్రదేశమంతా నిర్మానుష్యంగా ఉన్నది. కొంతదూరంలో లోతైన ఒక కందకం కనిపించింది. అందులో ఏమీ లేదు. ధైర్యశాలి అయిన కళాధరుడు ఈ కందకం అతి సులువుగానే దాటగలిగాడు.

కొంచెం దూరాన సరిగా మునపటంతే లోతూ వెడల్పూ గల మరిఒక కందకం అగపడింది. ఈ కందకం నిండుగా కనకన



లాడే నిప్పులున్నై. ఐనా ఒక కందకం దాటేవుండటంచేత, ఆ సులువు చూచుకుని చాకచక్యంతో ఇదికూడా దాటివేశాడు.

తరువాతి కందకంలో జోరుగా ప్రవహించే నీరున్నది. కళాధరుడు ఒక్కగెంతు వేశాడు. కాని పాపం, కాస్తంతలో గురితప్పి నీటిలో పడిపొయ్యాడు. కందకపు గోడలు ఎటుచూచినా నున్నగా ఉండటంవల్ల చేతికి పట్టుదొరకలేదు. కనుక ఎక్కి పైకి రావటానికా వీల్లేదు. చేసేది లేక, అతడు అలా అక్కడనే ఈదుకొంటూ నీటిపైన తేలివున్నాడు. కొంచెం సేపటికల్లా బిలబిలమంటూ కొన్ని చిలకలు ఒక మానుపలక పట్టుకవచ్చి కందకంలో పడవేశాయి. అది అందుకుని కళాధరుడు దానిమీద కూర్చున్నాడు. ఇందువల్ల అతడు ఈదవలసిన బాధ తప్పిపోయింది. అంతలోనే మరికొన్ని చిలుకలు ఒకమోకు మోసికొని వచ్చి, దానిని ఒక చెట్టుకి మెలివేసి, రెండవకొస కందకం లోపలికి విసిరినై. ఆ మోకు అందిపుచ్చుకొని కళాధరుడు పైకి వచ్చేశాడు. అతడు గట్టుపైకి వచ్చేసరికల్లా మంచి మంచి ఫలాలు సిద్ధంగా ఉన్నయి. అవి ఆరగించి అతడు సేద తీర్చుకున్నాడు. స్తిమితపడినతరువాత చూడగా ఆ పలక తన పడవకు అమర్చిన పలకే! ఆ మోకు తన పడవకు కట్టిన మోకే!! తనను రక్షించిన ఆ చిలుకలు తను సృష్టించిన కొయ్యచిలుకలే!! అతడు చూస్తూవుండగానే అవి ఎగిరిపోయినై.

విచిత్రమైన ఈ సంఘటనకు విస్తుపోతూ, ముందుకు సాగాడు కళాధరుడు. ఆ తరువాత దాటవలిసిన కందకాలు ఒకదానికంటె ఒకటి మరింత భీతావహంగా కన్పట్టినై. నాలుగవ కందకంలో నాగుపాములు బుసలుకొడుతూ విషం కక్కుతూ వున్నై. దీనినీ చాకచక్యంతోనే దాట

గలిగాడు. ఐదవదానిలో ఆకలిగొన్న సింహాలూ, అనేకమైన అడవిజంతువులూ గాండ్రుపెడుతున్నవి. కళాధరుడు వాటి బారిని పడకుండా ఆ కందకమూ దూకాడు. ఆరవదానిలో అతి క్రూరమైన మొసళ్లూ, జలచరాలూ నోళ్లు తెరుచుకు కనిపెట్టు కున్నాయి. చతురుడైన కళాధరుడు ఈ కందకమూ అపాయము లేకుండానే దాటాడు.

ఈవిధంగా ఇప్పటికి ఆరు కందకాలు దాటుకువచ్చాడు. ఇంకొక్కటే మిగిలి వున్నది. అది దాటేస్తే తిన్నగా భవనంలోకి వెళ్లి రాకుమారిని చేపట్టడమే! 'ఆరు కందకాలు దాటిన నాకు ఇంకొక్కటి దాటడం ఏపాటి ?' అనే నిబ్బరంతో అతడు సాగిపోయాడు.

చిట్టచివరకు ఏడవ కందకం వచ్చేసింది. ఇందులో వాడిఐన బల్లేలు వరస వరసలుగా అమర్చబడివున్నాయి. ఇది దాటడమనేది కళాధరునికి అతి సుకరమని తోచింది. ఒక్క ఊపుతో అతడు బలంకొద్ది గెంతు వేశాడు. వేశాడే కాని, పాపం, కాలు జారి కందకంలో పడిపొయ్యాడు! పడిపోవడమేమిటి? బల్లేలు గుచ్చుకుని తక్షణమే ప్రాణాలు విడిచాడు!



ఇప్పటికి కళాధరుడు ఇక్కడప్రవేశించి ఏడవరోజు. అతని గతి ఏమైందో చూతామని రాజు బయల్దేరి వచ్చాడు. రాజు వచ్చేసరికల్లా కందకములో పడిన కళాధరుడు కంటపడ్డాడు. అతనిచుట్టూ లెక్కలేనన్ని చిలుకలు గుమికూడి విచారముతో అరుస్తున్నై.

ఈ దృశ్యం చూచినతోనే రాజు గుండె నీరైపోయింది. "నోరులేని ఈ చిలుకలకు వున్నపాటి జ్ఞానం అయినా లేదే నా కుమార్తెకు? ఆ దుర్మార్గురాలి కారణంగా యిక ఎవరూ బలికావటానికి వీల్లేదు. ఈ దుర్నయం యింతటితో ఆగాలి; లేదా ఆ

దుర్మార్గురాలైనా బలి కావాలి" అంటూ ఉగ్రుడైపోయాడు. సరాసరి కుమార్తెవద్దకు వెళ్ళాడు. "నీమూలాన ఎందరు ప్రాణాలు కోల్పోతున్నారో గ్రహించలేక పోతున్నావు. నీ శపథం వదిలావా సరే. లేదా, నీవే ఈనాడు బలి అవుతావు. నీ మూర్ఖత్వంవల్ల ఎంచక్కటి రాకుమారుణ్ణి పొట్టబెట్టు కున్నావో చూద్దువుకాని, రా" అంటూ చరచర లాక్కు వచ్చాడు.

రాజు తిరుగ వచ్చేసరికల్లా ఏమి చిత్రం! చిలుకలు కొన్ని కళాధరుని గుండెపైన కూర్చుని ఏవో ఆకులు నోటిలో కూరుతున్నై. మరికొన్ని చిలుకలు వేరుముక్కలు కరుచుకుని, బల్లెపుమొనలు గుచ్చుకొనివున్న చోటులందెల్లా రాస్తున్నయి. తక్కిన చిలుకలు ప్రశస్తమైన ఫలాలు నోట పెట్టుకుని సిద్ధంగా కూర్చున్నయి.

కళాధరుడు కొంచెము కదలజొచ్చాడు. తనతప్పిదానికి క్షమించుమని రాజకుమారి తండ్రిపాదాలమీద పడింది. రాజు అజ్ఞాపించగా, తక్షణమే ఆస్థానవైద్యులు వచ్చారు. కళాధరునికి చికిత్స చేశారు. బలగమంతా అనేకవిధాల ఉపచారాలు కావించారు. కొంచెం స్తిమితపడగానే అతనిని కోటకు కొనిపోయారు. చిలుకలు కూడా అతనివెంట కోటకు వెళ్లాయి.

కొద్దికాలానికే కళాధరునికి గాయాలు మానిపోయి, బాగా నిమ్మళించింది. రాజు తన కుమార్తెనిచ్చి అతి వైభవంగా పెళ్ళి చేశాడు. ప్రాణదాతలైన ఆ రామచిలకలు నూరింటికీ మరునాటికల్లా నూరు బంగారు పంజరాలు తయారై వచ్చినై. ఎంతో ఆప్యాయంతో ఆ నూతన దంపతులు వాటిని ఆ బంగరు పంజరాలలో పెట్టి, వాటికి కావలసిన సదుపాయాలన్నీ అమర్చారు. తెల్లవారి పంజరాలు తెరచిచూడగా, ఆ నూరు రామచిలకలూ కళాధరుడు తయారుచేసిన కొయ్య చిలుకలుగా మారిపోయివున్నై!!






గోదావరిజిల్లా పెనుగొండగ్రామంలో ఎక్కువ మంది వైశ్యులుండేవారు. వారి అందరిలో కుసుమశ్రేష్ఠి సకల ఐశ్వర్యసంపన్నుడూ, సత్కార్యములయందు ఆసక్తి కలవాడున్ను. ఆయన సతీమణి కుసుమాంబకూడా ధర్మ నిరతి కలదై, ఆహా అనిపించుకొంటూ వుండేది. అందుచేత ఈ పుణ్యదంపతుల పైన కులము వారందరకూ భక్తిభావం కుదిరింది.

కుసుమశ్రేష్ఠికి అన్నీ బాగానే వున్నయి కాని, సంతతి లేని లోపంమట్టుకు సదా పీడిస్తూ వుండేది. సంతతికోసం ఆ దంపతులు చేయని పూజ లేదు, ఆచరింపని వ్రతం లేదు. ఐనా, ఫలితం లేకపోయింది. చివరకు వేదవేత్తలైన బ్రాహ్మలు అతనితో 'ఓయి శ్రేష్ఠీ! నీవు పుత్రకామేష్ఠి యాగం చేస్తివా, నీ కోరిక ద్విగుణీకృతంగా ఫలిస్తుంది' అని సలహా చెప్పారు.

వారి సలహాను శిరసావహించి, శ్రేష్ఠి వెంటనే యజ్ఞానికి ఏర్పాట్లు కావించాడు. అత్యంతమైన భక్తిశ్రద్ధలతో ఆ దంపతులు యాగం పూర్తిచేసేసరికల్లా అగ్నికుండం నుంచి దేవి వచ్చి ప్రత్యక్షమై వారికి ఫలాలు అనుగ్రహించింది. ఆ ఫలాలను వారు సంతోషంతో ఆరగించారు.

కొద్దికాలానికే కుసుమాంబ గర్భవతి అయింది. మరికొద్దిరోజులకల్లా దేవికటాక్షం వల్ల ఆమె కడుపున అపురూప సుందరులైన ఇద్దరు కవలలు పుట్టారు—అందులో ఒకడు పిల్లవాడు, ఒకతె పిల్ల. పిల్లకు వాసవాంబిక అనీ, పిల్లవానికి విరూపాక్షుడనీ నామకరణం చేసి, తలిదండ్రులు వారిని అల్లారుముద్దుగా పెంచుకొంటున్నారు. వరప్రసాదంగా పుట్టిన ఆ కవలలు అతి కొద్దికాలంలోనే సకల విద్యలయందూ ప్రవీణులై, యౌవనవంతులైనారు.

సి. వి. రమణి - కార్వేటినగరం




కుసుమశ్రేష్ఠి పెనుగొండలో ఉండే కాలమందు, వేగిదేశాన్ని విష్ణువర్ధన విమలాదిత్యుడు పాలించుతూ ఉండేవాడు. వేగిదేశానికి ముఖ్యపట్టణం రాజమహేంద్రవరం. ఒకప్పుడు విమలాదిత్యుడు కళింగదేశంమీదికి దండెత్తి వెళ్లి జయించాడు. ఐతే కళింగరాజు వెంటనే మళ్లీ బలం సమకూర్చుకుని తిరుగుదాడి చేసి, విమలాదిత్యుణ్ణి ఓడించాడు.

ఈ దాడులు, దండయాత్రలు జరిగిన సమయంలో వేగిరాజ్యం అల్లకల్లోలమైపోయింది. అరాచకం అణచివేదామనే సంకల్పంతో సామంతరాజైన కుడ్యవర్మను, దండనాయకుడైన నృపకామయ్యణ్ణి, అమాత్యశిఖామణి ఐన విజ్జియను వెంటబెట్టుకుని, విమలాదిత్యుడు సంచారం బయల్దేరాడు. సంచారంలో రాజు పెనుగొండ సమీపాన విడిది చేశాడు.

రాజు వచ్చిన వైనం తెలియగానే, పెనుగొండలోని వైశ్యప్రముఖులు ఆయనను సందర్శించి, ఉచితసత్కారాలతో తోడుకొనివచ్చి తమ గ్రామంలో ప్రవేశపెట్టారు. శ్రీమంతులకు సాధ్యంకాని దేమి వుంటుంది! వారు రాజుకి చేసిన సత్కారం ఇటువంటిదీ అని నోటిమాటలతో వర్ణింపనలవికాదు.

వారు రాజును పురమంతటా గొప్పగా వూరేగించారు. ఊరేగింపు కాగానే, అందరూ ఒక ఘనమైన మండపం చేరుకున్నారు. అప్పటికప్పుడే అక్కడ వైశ్యస్త్రీలందరూ శృంగారంగా ముస్తాబులు చేసుకుని, సిద్ధంగా వుండి, మహారాజుకు మంగళహారతులిచ్చారు.

వైశ్యప్రముఖుల సన్మానానికి విమలాదిత్యుడు అపరిమితానందభరితుడయ్యాడు. ఆ సంతోషంలో ఆయన 'మా క్షేమం కోరిన ఈ ముత్తైదువలకు శ్రీకర

మైన తాంబూలం ఈయదలిచాము. ఎవరికి యివ్వటం?' అని ప్రశ్నించాడు.

అప్పుడు ఒక వృద్ధురాలు లేచి 'ప్రభూ! మా కులానికి కుసుమాంబాదేవినే గ్రామంలో పెద్దగా ఎంచుకుంటున్నాము. తాంబూలం అందుకోటానికి ఆమే అర్హురాలు' అని చెబుతూ, కుసుమాంబను చూపించింది.

రాజు కోరినప్రకారం కుసుమాంబ తాంబూలం అందుకొనటానికని వెళ్లింది. రాజు తాంబూలం అందిస్తూ కుసుమాంబ పక్కనే వున్న వాసవిని అట్టె చూచాడు. ఆమె అందానికి ఆయన ముగ్ధుడైనాడు.

రాజు మకాముకు మరలి, మంత్రుల ద్వారా కుసుమశ్రేష్ఠికి కబురు చేశాడు.— వాసవి కన్యను తను రాణిగా చేసుకోదలిచానని! శ్రేష్ఠికి ఇది పిడుగువార్త ఐనది. 'వారు క్షత్రియులు, మేము వైశ్యులము. మా ఉభయులమధ్యనీ ఎన్నడూ పొత్తులు లేవే? లోకాచార విరుద్ధమైన ఇటువంటి పని మా కులమువారు అంగీకరిస్తారా? ప్రభువైతేమట్టుకు ఇలాటి విడూరపు కోరిక కోరడమేమిటి?' అని ఆశ్చర్యపోయాడు కుసుమశ్రేష్ఠి.



ఇందుకు మంత్రులు కోపఘోరణిలో "రాజాజ్ఞ అంటే యేమిటనుకున్నావోయి శెట్టీ!— తిరస్కరించావో, మీ పురం కొల్లగొట్టి, బలిమినైనా నీ కుమార్తెను తీసుక పోగలడు మా రాజు. ఆలోచించుకో' అంటూ హెచ్చరించి వారు వెళ్లిపోయారు.

వెంటనే పురవైశ్యులంతా సభ తీర్చారు. 'రాజు దుష్టుడన్న సంగతి కానుకోలేక పోయాము. మర్యాద చేసి గ్రామంలోపలికి తీసుకరావడమల్లా రొమ్ముమీద కుంపటి తెచ్చి పెట్టుకున్నట్టయిందే' అని వారు చాలా విచారించారు. 'కులాచారాలు మీరడం పాడికాదు' అని నచ్చజెబుతూ



రాజుకి రాయబారాలు పంపారు. ఐతే ఈ మాటలు వేటినీ రాజు కొంచెమైనా పాటించ లేదు. బలవంతుడైన రాజుకి ఎదురు చెప్పలేక పెనుగొండ పౌరులు కపటమైన వుద్దేశంతో 'అలాగే' అని అంగీకారం తెల్పి, అప్పటిమట్టుకు ముప్పు తప్పించుకున్నారు. వివాహపు ఏర్పాటులకు రాజువద్ద గడువు కోరి, మెల్లగా ఆయనని సాగనంపారు.

రాజు వెళ్లిపోగానే కుసుమశ్రేష్ఠి ఊరూర నుండే తన బంధువర్గమంతకూ జాబులు వ్రాసి రప్పించాడు. పరిస్థితులు తెలియ జెప్పి, 'గత్యంతరమేమిటి?' అని ప్రశ్నిం చాడు. వారిలో తీవ్రమైన వాగ్వాదాలు జరిగినై. వైశ్యులలో కొంతమంది సరాసరి రాజమహేంద్రవరం వెళ్లి, రాజును దర్శించి, 'దేవరా! వైశ్యులతో క్షత్రియులు వియ్యమందడం కేవలమూ శాస్త్రవిరుద్ధం. కాబట్టి ఏలినవారు ఈ సంకల్పం విరమించు కోవాలి' అంటూ ప్రార్థించారు.

మూర్ఖుడిమనసు మరల్చగలవారెవరు? రాజు కోపోద్దీపితుడై, "మా ఆజ్ఞ అక్షరాలా నెరవేరవలిసిందే. లేనిపక్షమందు వీరకంక ణాలు ధరించి సిద్ధంగా వుండండి!" అని అంటూ, కొంతమంది భటులను పెను గొండలో కాపలావుంచాడు. ఈ గడబిడ చూచి భయపడి, వచ్చిన వైశ్యులలో అరు వందల పన్నెండు గోత్రాలవారు పత్తా లేకుండా పారిపోయారు. ఈలా భిమానం కలవారందరూ 'రాజు ఏంచేయగలడో చూస్తాం' అనే పట్టుదలతో కుసుమశ్రేష్ఠి యింటనే నిలిచిపోయారు.

ఈస్థితిలో వాసవి, తండ్రివద్దకు వెళ్ళి, "నాయనా!—నన్ను గురించి ఎంతమాత్రం మీరు విచారించవద్దు. మన కులానికిగాని కుటుంబానికిగాని నావల్ల మచ్చవస్తుందని భయపడ పనిలేదు. నావివాహానికి అంగీక రిస్తూ, ఫలానిరోజుకు తరలి రమ్మనమని

రాజుకు కబురుపంపండి" అని వినయ పూర్వకంగా కోరింది. ఇంతకుమించి వివరము లేమీ చెప్పలేదు. తండ్రి రొక్కించి అడగనూలేదు.

ధైర్యంచేసి కుసుమశ్రేష్ఠి ఆప్రకారమే కబురుపంపాడు.

పెళ్లికి సుముహూర్తపురోజు వచ్చింది. గ్రామంలో బ్రహ్మాండమైన మండపం కట్టారు. మండపానికి పైన ఆకాశమంత పందిరి వేశారు. పందిరికి అందమయిన చాందినీలు అమర్చారు. అరటిస్తంభాలు పాతారు. తోరణాలు కట్టారు. ముత్యాల ముగ్గులు పెట్టారు. పరిమళాలు శోభిల్ల జేశారు. మండపంలో ఒక అగ్నికుండం నిర్మించారు.

ఈవిధంగా అలంకరింపబడిన పందిరి అశేషజనంతోనూ, అమూల్య వస్త్రాలు ధరించి వచ్చిన ముత్తయిదువలతోనూ క్రిక్కిరిసిపోయింది. ఆరోజున వాసవికన్య అభ్యంగనం చేసుకుని, పసుపు కుంకుమల చాయ చీర ధరించింది. నిండు శృంగారంతో నొసట తిలకం దిద్దుకొన్నది. గంధం పూసికొన్నది. బాజాభజంత్రీలు మ్రోగుతూ వుండగా ఆమె మండపంపద్దకు వచ్చింది.




వాసవాంబిక చేసిన ఈ యేర్పాటులకు అందరూ ఆశ్చర్యపోయినవారేగాని ఆమె మనసులోని వుద్దేశం యేమిటో ఒక్కళ్ళకూ అంతు చిక్కలేదు. ఆమె తలిదండ్రులకే యదార్థం తెలియదన్నప్పుడు తక్కినవారిమాట చెప్పేదేమిటి?

ఇంతలో రాజు సపరివారసమేతంగా పెనుగొండకు విచ్చేసి, మండపం చేరుకొన్నాడు. పందిరిలో ప్రవేశించగానే ఆ సన్నాహాలు చూచి ఆయన పరవశుడైపోయాడు. వాసవి రాజువద్దకువెళ్లి "రాజా!- అగ్నికుండం చుట్టూ వధూవరులు ముమ్మారు ప్రదక్షిణంచేసి, తరువాత గుడికి

పెళ్లి వివాహం చేసుకోవటం మా కులాచారం" అని చెప్పింది. 'సరే' నన్నాడు రాజు, సంతోషపూర్వకంగా.

వాసవాంబిక తన గురువులకు, తలిదండ్రులకు, బంధుమిత్రులకు, భూసురులకూ నమస్కరించింది. రాజును దారితీయమంది. తను అతనివెనుక అడుగులు వేయఃబొచ్చింది. దిక్కులు పిక్కటిల్లేలాగ బాజాభజంత్రీలు మార్మోగుతూ వుండగా అగ్నికుండం చుట్టూ వారు ప్రదక్షిణాలు చేయసాగారు. ఒక ప్రదక్షిణమైంది. రెండవ ప్రదక్షిణంకూడా ఐంది. మూడవ ప్రదక్షిణం పూర్తి అయేసరికల్లా భుగభుగమని ఎగసివచ్చే ఆ అగ్నిజ్వాలలలో వాసవి దభీమని దుమికి ఆత్మార్పణమైపోయింది!! అంతలో దేవివచ్చి, తన ముద్దుతనయను అక్కునఅదుముకొని అంతర్హితురాలైంది!!!

ఏమి జరుగబోతుందో నని రెప్పవాల్పక వేయికన్నులతో నిరీక్షిస్తూవున్న జనమంతా ఒక్కసారిగా గొల్లుమన్నారు. వాసవి తన వెనుకనే వస్తున్నదనుకొని భ్రమించిన విమలాదిత్యుడు వెంటనే పలాయనమయినాడు. ప్రాణాలు దక్కించుకొనటానికని అతడు పారిపోబోయాడేగాని, దేవి శాపంవల్ల ఆ దుష్టుడు దారిలోనే తలపగిలి చచ్చాడు. ప్రాణతుల్యమైన తమ వాసవిని కలుసుకోవాలనే ఆత్రంతో కుసుమశ్రేష్ఠి భార్యా ఆ అగ్నికుండంలోనే దుమికి ఆహుతి అయిపోయారు. ఇంతపని జరిగినతరువాత మనం ఉండేమి లేకేమి అనుకొని, కులాభిమానం గల మరి నూటరెండు గోత్రాల వైశ్యులు కూడా వాసవి వెళ్లినదారినే అనుసరించారు.

ఈవిధంగా—కులగౌరవార్థం మహిమాన్వితమైన త్యాగంచేసి వాసవికన్య వైశ్యకులానికి వన్నెతెచ్చింది!!! నాటినించీ ఆమె వైశ్యులకు కులదేవత అయి, 'శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరి' అనే పేరుతో అతివైభవంగా ఆరాధింపబడుతున్నది.






బలభద్రపురంలో ధర్మన్న అనే బెల్లపు వర్తకుడు ఉండేవాడు. పేరుకు ధర్మన్న గాని అతడు వట్టి లోభి. వాని భార్య ధనాలుమట్టుకు పెట్టుగుణం గల ఇల్లాలు. ఇంటికి వచ్చే ముష్టివాళ్లకు నోటితో కాకుండా చేతితో లేదని చెప్పి పంపేది.

"వచ్చినవాళ్లకల్లా ముష్టి వేస్తూ కూర్చుంటే, దివాణాలు కూడా దివాలా తీసేస్తాయి" అని ధర్మన్న భార్యను మందలించేవాడు. "పేదకూ సాదకూ విదుపుతూ వుంటేనే మనకు లక్ష్మి వృద్ధిపొందుతుంది" అని సమాధానం చెప్పేది ధనాలు. ఇలా ఉభయుల మధ్యనీ సంసారంలో రోజూ పేచీపడుతూ వుండేది.

చివరకు ఎలాఅయితేనేం, అతడు ఒక ఏర్పాటుకి వప్పుకొన్నాడు. ఇంటికి వచ్చిన ముష్టివాళ్లందరకూ గాక రోజుకి ఒక్కళ్లకు మాత్రం ఒక్క దోసెడు బియ్యంవేసి ఊరుకోవాలని చెప్పాడు. ఈమాత్రానికైనా వప్పుకున్నందుకు ధనాలు సంతోషించింది. మర్నాటినించీ బాగా దోసెలు నిండుగా బియ్యం తీసి, అవన్నీ ఒక్క ముష్టివాడికే వేసేది. ఆ దోసెడుబియ్యమూ చూడగా తవ్వెడుకు పైగానే ఉండేవి. "పోనీ ఒక్కళ్లకైనా కడుపునిండా భోజనం పెట్టగలిగాముకదా" అని ఆమెమనసులో ఎంతగానో తృప్తిపడేది.

ఇలా ఉండగా, వారి కోడలు రత్నం శ్రావణమాసం నోములకని అత్తారింటికి వచ్చింది. కోడలిని చూడగానే ధర్మన్నకు ఒక చిత్రమైన ఆలోచన తట్టింది. వెంటనే భార్యను పిలిచి, "ఒసే ఒసే! ఇటుపైన మన రత్నం చేతితో ముష్టివాళ్లకు బిచ్చం పెట్టించుతూ వుండు. ఆ ఁట్టిచేతులతో కొత్త కోడలు దానధర్మాలు చేస్తున్నదంటే చూడ ముచ్చటగావుండి, లోకులు అనం

డి. బలరామదాసు - పాలకొండ



దిస్తారు" అన్నాడు. ఏదోవిధంగా భర్తకు ఔదార్యం కలిగిందికదా అని ధనాలు చాలా సంతోషించింది. కాని ఇలా ఎందుకు చెప్పాడో, అతని అంతర్యం యేమయి వుంటుందో తెలుసుకుందామని మాత్రం ఆమెకు స్ఫురించనే లేదు.

ఇంతలో ధర్మన్న బెల్లం బేరం చేయ టానికని జరుగురుగా అనకాపల్లి వెళ్లవలిసి వచ్చింది. మామగారి కోరికప్రకారం మరునాటినించీ రత్నమే బిచ్చగాళ్లకు ముష్టి వేస్తూవచ్చింది. వేయడమంటే, బస్తాలోనించి బియ్యం తీస్తూ ఎంతమంది వస్తే అంతమందికీ తన చిట్టిచేతులతో ధర్మం చేయసాగింది. 'మరి ధనాలు రోజూ ఒక్కళ్లకే బిచ్చం వేసేదే, ఇప్పుడు రత్నం ఎంతమందికైనా ఎందుకు వేస్తున్నదీ?' అని సంశయం కలగవచ్చు. ఇందుకూ ఒక కారణముంది: అంత తెలివైన ధర్మన్న ఈ చిన్నవిషయంలో పప్పులో కాలువేశాడు.

ఎలాఅంటే—భార్య ధనాలు చేతులు పెద్దవి. పైగా ఆమె దూబరగొట్టు. రోజుకి ఒక్క దోసెడుమాత్రమే తీసినా తవ్వెడు గింజలకుపైగా పోతున్నై. కనుక ఈపని ఆమె చేతులలోనుంచి తప్పించితే ఇటు పైన ఇటువంటి దూబరా జరగబోదు అని తలిచాడు. సరే, భార్య చేతులనుండి ఈపని ఎలా మార్చడం? అని అతను ఆలోచించాడు.

ఇప్పుడు కోడలు ఇంట్లో కాలుపెట్ట గానే ధర్మన్న సమస్యకు సమాధానం వచ్చేసింది. కోడలి చేతులు చిట్టిచేతులు. ఈమెచేత ముష్టివేయిస్తే ఆ దోసిలిలో అర గిద్దెడు గింజలుకూడా పట్టవు. కాబట్టి బియ్యం అట్టే కర్చుకావు. ఈ ఆలోచనతో ఈ పని కోడలికి వప్పజెబితే బాగావుంటుం దని భార్యకు నచ్చజెప్పాడు. మాయా

మర్మమూ తెలియని ధనాలు ఈ మార్పుకి వెంటనే వప్పేసుకుంది.

తన మాటను ఆమె ఒప్పుకొన్నదన్న సంతోషంలో ధర్మన్న 'రోజుకి ఒకళ్లకు మాత్రమే వేయాలి' అనే షరతు ఊరికి వెళ్లేటప్పుడు చెప్పమరిచాడు.




అతడు చెప్పకపోతే రత్నానికేం తెలుస్తుంది? అందుకనే కోడలు రత్నం ఇంటికి వచ్చిన ముష్టివాళ్లందరకూ తన చిట్టిచేతులతో బిచ్చం వేస్తూవచ్చింది. ధర్మన్న యింట్లో ఈ మార్పు చూచి, ఊళ్లోవాళ్లేగాక పైగ్రామాల యాచకులుకూడా గుమ్మం ముందు బారులుతీర్చి నించునేవాళ్లు.

మరి వారం పదిరోజులకల్లా సరకు వేయించుకుని ధర్మన్న ఇంటికి చేరుకున్నాడు. అతడు వచ్చేసరికల్లా బారులుతీర్చి నించున్న యాచకులు 'అమ్మా, అన్నపూర్ణాదేవీ! తల్లీ!!'—అంటూ కోడలిని పొగడి, ఆమె చిట్టిచేతులతో వాళ్లందరూ బిచ్చం అందుకొంటున్నారు.

ఇది చూసి లోభి ఐన ధర్మన్నకు గుండె పగిలింది. చూచుకోగా, తను ఇంటిఖర్చు కోసం ఇచ్చిపోయిన బస్తా బియ్యమూ చాలవరకు ధర్మంకోసమే వినియోగమై, సంచీ ఖాళీ ఐంది. తీరా ఇప్పుడేమనుకుంటే యేంలాభం? 'ముష్టివేసే అధికారం కోడలుకు చేతులారా వప్పగించివేశామే. మళ్లీ మార్పు చేయబోతే నలుగురలో నగుబాటు కాదా!' అనుకున్నాడు ధర్మన్న. రత్నం హయాములో వారింట దానధర్మాలు విరివిగా జరగటంచేత ఆమెకు ధర్మాత్మురాలనే పేరు వచ్చింది. 'అయ్యో! సొమ్ము పోతే పోయింది పేరైనా దక్కుతుందనుకుంటే, సొమ్మునాది, పేరు ఆమెదీ ఐందే' అని ధర్మన్న లోలోపల కించపడ్డాడు. భర్తకు తగిన శాస్తి జరిగిందని ధనాలు సంతోషించింది.




## 3

ఒక మహారాజువద్ద ఉదారుడైన మంత్రి ఉండేవాడు. ఆయన నిరతాన్నప్రదాత. దేశదేశాలనుండి బ్రాహ్మణ్యం వచ్చి, ఆయన పంక్తిని రోజూ భోజనంచేస్తూ ఉండేవారు. వచ్చేవాళ్లెవరో, పోయేవాళ్లెవరో, ఎవళ్లు ఎంతకాలం తన యింట ఉన్నారో ఆ మంత్రి ఎన్నడూ లెక్క చూచుకోవటం అలవాటులేదు.

ఒకరోజున ఒక బ్రాహ్మడు రెండు పూటలా భోజనానికి ఉండిపోవటంవల్ల తరుచు మంత్రి కళ్లపడటం జరిగింది. మంత్రి "ఏమండీ, మనదేవూరు ?" అని అడిగాడు. అందుకు బ్రాహ్మడు "ఎరగరుటండీ, నేను మీ పెత్తల్లి కొడుకునుగానా ?" అని ఎదురుప్రశ్న వేశాడు.

మంత్రి అశ్చర్యపడి, "మా అమ్మకు అక్కగారే లేదే. ఈ సంబంధం ఎలా వచ్చింది !" అనుకొంటూ తనలో తను జిజ్ఞాసపడసాగాడు. అప్పుడు బ్రాహ్మడు చిరునవ్వుతో "అదేమిటలా విస్తుపోతారు ? మంత్రిపదవి రాగానే చుట్టరికాలుకూడా మరిచిపోవటం న్యాయమా ? సరే జ్ఞాపకం చేస్తానుండండి : మా అమ్మా మీ అమ్మా అప్పాచెల్లెళ్లు. పెద్దామె ఐన జ్యేష్ఠాదేవి కొడుకుని నేను. ఆమె సోదరి ఐన లక్ష్మీదేవి పుత్రులు మీరు. మీ తల్లి లక్షణాలుమీకూ, నా తల్లిలక్షణాలు నాకూపట్టేశాయి. పుట్టడమంటే వేరువేరుగా పుట్టాంగాని, ఉభయులమూ ఒక్క కుటుంబానికి చెందినవాళ్లమే కదా ! వేలువిడిచిన అన్నదమ్ములం గనక, నా కేదైనా ఉపకారం చేయండి మరి !" అంటూ, తన స్థితిగతులు వెల్లడించేసరికి, బ్రాహ్మడి చమత్కార సంభాషణకు మెచ్చుకుని, మంత్రి ఆయనకు మంచి ఉద్యోగ మిప్పించాడు. నాటినించీ బ్రాహ్మడు సుఖంగా ఉంటున్నాడు.

## 4

ఒక గొప్పవర్తకుడు ఉండేవాడు. అతడు ఓడమీద వర్తకానికి వెళ్లేవాడు. వెళ్లేముందు ఇంట్లో అందర్నీ 'నేను దేశం పోతున్నాను. మీకు ఏమేమి కావాలి?' అని అడిగేవాడు.

ఇలాగే ఒకమారు అడిగి, అందరి కోరికలూ తెలుసుకున్నాడు. తరువాత తాను కొత్తగా పెంచుతున్న రామచిలుకవద్దకు వెళ్ళి దాన్నికూడా అడిగాడు. అప్పుడా చిలుక 'ఆ రోజు నీవు నన్ను పట్టిన అడవిలో ఒక పెద్ద రావిచెట్టు వుంది. ఆ చెట్టుమీద ఇంకా ఎన్నో చిలుకలుంటాయి. నీవు వెళ్లి వాటితో 'మీలాటి చిలుకే నావద్ద కూడా ఒకటి వుంది. ఈమాట మీతో అది చెప్పి రమ్మంది' అను. అవి ఏమి జవాబిస్తాయో వచ్చి నాతో చెప్పు. ఇదే నాకు కావలసిన ఉపకారం' అని చెప్పింది.

మరునాడే వర్తకుడు ప్రయాణం కట్టాడు. ఆరునెలలకు అతని వ్యాపారం పూర్తి అయింది. తరువాత చిలుకచెప్పిన అడవిలో పెద్దరావిచెట్టువద్దకు వెళ్ళి అక్కడ ఉన్న వేలకొలది చిలుకలతో 'ఓ చిలుకల్లారా! మీలాంటి చిలకే నావద్దా వుంది. ఈమాట అది మీతో చెప్పమంద' అన్నాడు.

ఇది వినగానే వాటిలో ఒక చిలుక రెపరెపా రెక్కలు కొట్టుకుని కిందపడి చనిపోయింది. తక్కినవన్నీ ఏజవాబూ చెప్పకుండానే ఎగిరిపోయాయి. సరే వర్తకుడు ఇల్లు చేరుకుని 'అడవిలో చిలుక చచ్చిన వార్తను తన చిలుకకు చెప్పాడు.

వెంటనే ఆ చిలుకకూడా గిలగిల తన్నుకుని పంజరంలోనే ప్రాణం వదిలింది. 'అయ్యో!' అనుకుని అతడు పంజరం తలుపులు తెరిచి, చిలుకను బైట పారేశాడు. వెంటనే ఆచిలుక రివ్వున ఎగిరిపోయి ఒక కొమ్మమీద కూచుని 'ఓయీ వర్తకుడా! స్వేచ్ఛకోరి, నేను నీవద్ద వుంటున్న వార్త సంజ్ఞతో నావారికి తెలియజేశాను. వాళ్లు నా మాటను అర్థం జేసుకుని, నీవద్ద నుండి నా విడుదలకు ఈవిధంగా దారి చూపారు' అంటూ ఎగిరిపోయింది. వర్తకుడు తెల్లబోయాడు.

జూలై నెల మాకు వచ్చిన చిట్టికథలలో పై రెండు కథలూ బహుమతి పొందినవి.

3-వ కథ—వ్రాసినది: కె. స్వరాజ్యలక్ష్మి, పాకాల—బహుమతిగా ఈమెకు ఎంబ్రాయిడరీ సెట్టు పంపుతున్నాం. 4-వ కథ—వ్రాసినది: టి. ఏ. రామప్రకాష్, ఇట్సి—బహుమతిగా యితనికి ఆకర్షణీయమైన మనీపర్సు ఒకటి పంపుతున్నాం.



# ఏకాగ్రత

మహారాష్ట్ర దేశంలో పైఠణపురం అనే గ్రామం ఉంది. ఆ ఊళ్ళో ఏకనాథుడనే బాలుడుండేవాడు. ఆ గ్రామానికి సమీపం లోనే జగన్నాథుడనే మహాపండితు డొకడు వున్నాడు. ఆయనవద్ద చదువుకుని జ్ఞానం సంపాదించాలని దూరదేశాలనుంచికూడా ఎందరో శిష్యులుగా వచ్చేవారు.

ఏకనాథుడుకూడా వెళ్ళి, 'స్వామీ, నన్ను మీ శిష్యునిగా చేర్చుకొని నాకు తారక మంత్రం ఉపదేశం చెయ్యండి' అని ప్రార్థించాడు. ఆ పిల్లవాణ్ణిచూసి జగన్నాథ పండితుడు 'అబ్బాయ్, నువ్వింకా చాలా చిన్నవాడివి. వెళ్ళు. పెద్దవాడి వయాక రా' అన్నాడు. ఏకనాథుడు కదల్లేదు. 'స్వామీ! వయసుతో పనేమున్నదండీ? ధ్రువుడు చిన్నవాడుకాడా, అతణ్ణి విష్ణుమూర్తి అనుగ్రహించలేదా? నన్ను మీరు అనుగ్రహించండి' అని బ్రతిమాలేడు.

చేసేదిలేక జగన్నాథపండితుడు 'అలైతే సరే. శ్రద్ధా, దీక్షా కుదిరినవాళ్ళకిగాని తారక మంత్రం ఉపదేశించటానికి వీల్లేదు. నీకు అటువంటి దీక్ష కుదిరిందని నాకు తోచి నప్పుడే ఆ మంత్రం ఉపదేశిస్తాను. అంత వరకూ నువ్వు ఆమాట ఎత్తకు' అన్నాడు. 'మహాప్రసాదం' అన్నాడు ఏకనాథుడు.

గురువుగారింట్లో శిష్యులు తలొకపనీ చేస్తూండేవారు. ఏకనాథుడితో పండితుడు, 'అబ్బాయీ, కాయకష్టం పడే శక్తి నీకు లేదు. కనుక ఒకచోట కూచుని, మా యింటి జమాఖర్చు లెక్కలు రాస్తూవుండు,' అని చెప్పేడు. ఏకనాథుడు, శ్రద్ధగా లెక్కలు వ్రాయసాగాడు.

సంవత్సరాలు గడిచాయి. ఏకనాథుడు రోజూ జమా ఖర్చులు రాస్తూనే ఉన్నాడు. ఒకసారి ఒక్క కానీ తేడావచ్చింది. 'ఈ కానీ ఎలాఖర్చు ఐంది?' అని అతడు తెగ ఆలో

పాలంకి. వెంకటరామచంద్రమూర్తి - మదరాసు



చించాడు, కాని అను దొరకలేదు. రాత్రి ఎనిమిది గంటలైంది; అతిథుల భోజనాలు అయాయి. తొమ్మిదైంది; శిష్యుల భోజనాలుకూడా అయాయి. పది అయింది. మాటు మణిగి అంతా పడుకున్నారు. కాని, ఆ కానీకోసం ఏకనాధుడు లెక్కల పుస్తకాలు తిరగేస్తూనే కూచున్నాడు.

రాత్రి పన్నెండు గంటలైంది. ఏదో అలికిడై జగన్నాధపండితుడికి మెలకువ వచ్చింది. చూచేసరికి ముత్యమంత దీపం ముందు కూచుని లెక్కలు తిరగేస్తూవున్న ఏకనాధుడు కనపడ్డాడు. భోజనసమయంలో అతగాడు పంక్తిని కనపడలేదన్న మాట జగన్నాధునికి అప్పుడు జ్ఞప్తికి వచ్చింది. వెళ్ళి, అతడి ప్రక్కనే నిలబడ్డాడు. గురువుగారు తనప్రక్కనున్నట్లే తెలియదు అతడికి. మరొకగంట సాగిపోయింది. ఉన్నట్టుండి అతడు, 'ఆ-దొరికేవు!' అంటూ, ఎగిరి గంతేశాడు. అప్పుడు ప్రక్కనేవున్న గురువుగారి చెయ్యి తగిలి అతడు నివ్వెరపోయి, 'స్వామీ; వచ్చి ఎంతసేపయింది?' అన్నాడు. అందుకు గురువుగారు, 'ఇంత దీక్షగా నీవు వెతికి పట్టుకున్నదేమిటి?' అని అడిగాడు.

ఏకనాధుడు, 'ఒక్క కానీ, స్వామీ. నేడు మనగృహానికి అతిథిగా వచ్చిన హరనాథ భట్టాచార్యులవారికి కావాలంటూ శిష్యుడొకతను వచ్చి ఒక కానీ పట్టుకువెళ్ళేడు. అది ఖర్చు రాయటం మరిచా. ఇప్పుడు దొరికింది. కృతార్థుణ్ణి!' అన్నాడు.

గురువు మనసు కరిగి, 'నాయనా, ఆ కానీకోసం నిద్రాహారాలు మానుకు కూచున్నావా?' అన్నాడు.

'నిద్రాహారాలు చూసుకుంటే ఏపని సాధించగలను స్వామీ?' అంటూ లేచి అతడు గురువుకి నమస్కరించి తనగదికి వెళ్లిపోయాడు.




జగన్నాథపండితుడికి ఆక్షణంలోనే ఒక సంకల్పం కలిగింది. 'కానీ వెతకటం కోసం ఇంత దీక్షను పూనేడీతడు. భగవంతుణ్ణి వెతకటంలో ఈ మహాదీక్షను వినియోగిస్తే అది సద్వినియోగ మవుతుందే. కనుక ఇత డింక ఈ జమా ఖర్చులలో కాలం వృథా చెయ్యకూడదు' అని నిశ్చయానికి వచ్చాడు. ఏకనాథుణ్ణి ఏకాంతంగా పిలిచి, "నాయనా, నేడు మన గృహానికి అతిథిగా ఒక ఛండాలుడు నాలుగు కుక్కల్ని వెంటబెట్టుకు వస్తాడు. అతనికి తగురీతి నీవు పరిచర్యచేసి, ఆయన హృదయాన్ని వశంచేసుకోగలిగితివా, నీకు ఆయన తారకమంత్రాన్ని ఉపదేశిస్తాడు. 'ఛండాలుడేమిటి, తారకమంత్రం ఉపదేశించడ మేమిటి?' అని సందేహించకు. ఆ మహానుభావుతే నా గురువైన దత్తాత్రేయస్వామి. వారివెంటవచ్చే కుక్కలు నాలుగూ నాలుగు వేదాలు. ఆయనను గురువుగా స్వీకరించి, ఉపదేశం పొంది తరించు" అన్నాడు.

అందుకు ఏకనాథుడు, 'స్వామీ! మీ పాదాలను ఆశ్రయించిన నా మనస్సు అన్యులను ఆశ్రయించలేదు. నాకు అర్హత కలిగిందని తమకు తోచిననాడు ఆ మంత్రాన్ని తమరే ఉపదేశించండి' అని వినయపూర్వకంగా ప్రార్థించాడు.

దత్తాత్రేయస్వామి వేంచేశాక జగన్నాథుడు ఆయనకు పరిచర్యచేసి, ఏకనాథుడు తనతో నాటిఉదయం అన్నమాటలు చెప్పేసరికి, దత్తాత్రేయుడు, 'జగన్నాథా! నీ శిష్యుడు, అన్యగురువుల్ని స్వీకరించటానికి ఒప్పుకొనకపోవటం సహజమే. ఐనా, నీకీచింత యెందుకు? చెట్టు మొదట పోసిన నీరు మ్రానుకూ, కొమ్మలకూ, ఆకులకూ ఎక్కినట్లే ఏకనాథుడు నీకుచేసేసేవ నాకే చెందుతూ, అతడు నా కరుణకు

పాత్రుడవుతున్నాడు. కనుక తారకం నీవే అతనికి ఉపదేశించు. అందుతో అతడు రామభక్తుడవుతాడు, కవిత్వం అబ్బుతుంది. ఆ కవితాశక్తిని వినియోగించి మహరాష్ట్రంలో వాల్మీకి రామాయణం రచించమని అతనికి అజ్ఞాపించు. ఈ విధంగా లోకానికి ఉపకారం ఔతుంది' అని చెప్పి, అదృశ్యుడయాడు.

ఏకనాధుడి చిరవాంఛ ఫలించింది. జగన్నాధపండితుడు అతనికి తారక మంత్రం ఉపదేశించి 'నాయనా! ఇంక నీవు పైఠణపురం వెళ్లు. వృద్ధులైఉన్న నీ తలితండ్రుల్ని సేవించి, రామాయణ మహాకావ్యాన్ని మహారాష్ట్రభాషలో రచించు' అని అజ్ఞాపించాడు.

గురువాజ్ఞప్రకారం ఏకనాధుడు పైఠణపురంవెళ్లి, రామాయణం వ్రాయటం మొదలెట్టేడు. మొదలెట్టడమేమిటి? రామాయణకథలో లీనమైపోయాడతడు. సీతారామలక్ష్మణుల్ని అరణ్యానికి పంపుతూన్నప్పుడు అయోధ్యాపురజనులతోపాటు అతనూ ఏడ్చేడు. అడవిలో సీతారాముల కోసం లక్ష్మణస్వామితోబాటు అతడూ కందమూలాదులు వెతికేడు. సీతను ఎత్తుకు




పోతోంటే, అడ్డపడ్డ జటాయువుతో బాటు అతడూ రావణాసురుణ్ణి అడ్డగించాడు.

ఇలా రామాయణం రాసేస్తున్న ఏకనాధునిమీద ఉక్రోషం కొద్దీ, పైఠణ పురవాసులు ఎలాగైనా అతన్ని బయటకు రప్పించి ఏడిపించాలని చూశారు. తలుపు గ్రుద్ది చప్పుడుచేశారు. కాని దొడ్లో కూచుని రాసుకుంటూవున్న ఏకనాధునికి ఏమీ వినపడనే లేదు. ఇంట్లోకి రాళ్లు విసిరారు. బ్రహ్మచెముడుమట్టలు తెచ్చి పడవేశారు. సమాధిలోవున్న మహాయోగికిమల్లే రచనాదీక్షలోవున్న ఆ మహాకవికి చీమ కుట్టినట్టయినా అనిపించలేదు.

ప్రాణంవిసిగి వాళ్లు పోదామనుకుంటూ వుండగా ప్రహరీగోడ మీద నుంచి తాళ ప్రమాణపు ఎత్తున ఎగిరివచ్చి, ఏకనాధుడు వాళ్లమీద పడ్డాడు. 'ఏమిటిది?' అంటూ వాళ్లు అదరిపడ్డారు. అంత ఎత్తు నుంచి వచ్చి పడటంచేత ఏకనాధుడికి దెబ్బలు తగిలి మూర్ఛపోయాడు.

ఎలాగైనా అతణ్ణి ఏడిపిద్దామన్న సంకల్పంతో వచ్చిన వాళ్లంతా తమ ఉక్రోషం మరిచిపోయి, ఏకనాధుణ్ణి సేదదేర్చారు. అతనికి బాగా తెలివివచ్చాక 'ఏమిటి బాబూ? ఇలా ఎగిరివచ్చా వెందుకూ?' అని ప్రశ్నించారు. ఏకనాధుడు ఆశ్చర్యపోతూ 'ఏమిటి? నేనా ఎగిరివచ్చానా? హనుమంతుడుకాదూ? సముద్రందాటి ఇప్పుడు లంకలో ప్రవేశించాడు హనుమంతుడు' అంటూ ఎడమచేతిలోఉన్న తాళపత్రాన్ని కుడిచేతిలో ఉన్న గంటంతో చూపించాడు.

అందులో ఏముంది? హనుమంతుడు సీతను వెతకటానికని సముద్రం ఎలా లంఘించాడో ఆ ఘట్టం వర్ణింపబడిఉంది. సరిగా అదే సమయంలో తన శిష్యుణ్ణి చూచిపోదామని జగన్నాధపండితుడు అక్కడికి వచ్చి చేరుకున్నాడు. సంగతి సందర్భాలు తెలుసుకున్నాడు. 'రామాయణకథలోని పాత్రలతో ఐక్యమైపోయి, మహాకావ్యాన్ని రచిస్తున్నా డీ మహాకవి! ఇతనికేమీ విఘ్నాలు కలిగించకండి. ఈ దీక్షలో ఉన్నంతకాలం యితనికి ఏ ఆపదా రాకుండా కాపాడుతూవుండండి. ఇతనికి నేను గురువు ననిపించుకోవడం నా భాగ్యం' అంటూ పొగడి చెప్పాడు.

అంతటితో వాళ్లకి జ్ఞానోదయమైంది. ఆయన చెప్పినప్రకారమే చేశారు.

ఈ విధంగా మహాభక్తుడైన ఏకనాధుని మహారాష్ట్ర రామాయణం వెలసి, మనకు ధన్యత చేకూర్చింది.



# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

అడ్డము:

1. మంట
4. అమృతము
5. పందెము
7. ఒక నది
8. ఆదాయము
9. ఒక సంవత్సరము
13. పార్వతి
14. తప్పెట




నిలువు:

2. సిగ్గు
3. దయ
4. ఉమార్త
5. ఉన్నతస్థితి
6. కృష్ణుడు
10. యముడు
11. శత్రువు
12. వీధి

ఒంటిగీత బొమ్మ



దీనిని వ్రాసినది: టి. వి. రంగస్వామి, ఆరణి

# చేసి చూడు

రెండు నిప్పుపుల్లలు తీసుకో. అందులో ఒకదాని చివరను రెండుగా చీల్చు. రెండవ పుల్ల చివర సన్నగా చెక్కు. మొదటిపుల్ల చీలికలో రెండవ పుల్ల చెక్కిన భాగం దూర్చు. ఇలా దూర్చగా అది ఇంగ్లీషు 'వి' (V) అక్షరం ఆకారంలో ఉండాలి. ఇప్పుడు (రొట్టెలు కోసే) కత్తి తీసుకుని, పదును వున్నవైపు పైకి ఉండేట్టు పట్టుకో. ఇలా పట్టు



కొన్నప్పుడు కత్తి, పక్కకిగాని ముందుకు గాని వెనకుగాని ఒరగకూడదు. నిప్పుపుల్లలను కత్తి అంచుమీద ఉంచి, దాని దిగువనున్న చివరలు టేబిల్‌కు అంటీ అంటకుండా కత్తిని పట్టుకో. నిప్పుపుల్ల కత్తిఅంచుమీదగా నడిచివస్తుంది.

* * *

రెండు గ్లాసులు తీసుకో. రెండిటినీ షుమారుగా నీటితో నింపు. ఒకదానిలో కరగకుండా మిగిలిపోయేవరకు ఉప్పు వెయ్యి. ఒక కోడిగ్రుడ్డుతెచ్చి మామూలు నీళ్లున్న గ్లాసులో వెయ్యి. గ్రుడ్డు మునిగిపోతుంది. తరువాత గ్రుడ్డునుతీసి ఉప్పునీటిలోవెయ్యి. అది మునిగిపోక తేలివుంటుంది.

మరొక ట్రిక్కు: పైన తయారుచేసివున్న ఉప్పునీటిలో ఒక సన్నటి దారం తడిపి ఆరబెట్టు. ఇలా నాలుగైదు సారులు ఆ దారాన్ని ఉప్పునీటిలో తడిపి



ఆరబెట్టుతుండు. ఇప్పుడు దారానికి ఒక చివరను చిల్లుకానీగాని, లేదా పటాలకు అమర్చే చిన్న రింగుకాని కట్టు. రెండవ చివర క్లిప్పుతో పట్టుకుని, రింగున్నవైపు వేలాడుతూ వుండనీ. నిప్పుపుల్లగీచి రింగు కట్టి ఉన్న కొస అంటించు. చురచుర మని దారం అంటుకొని, క్లిప్పు వరకూ కాలిపోతుంది. అయితే, అంతమాత్రాన మీరుకట్టిన చిల్లుకానీగాని, రింగుగాని కింద పడక, అలా దారాన్ని వేలాడుతూనే వుంటుంది.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 జ్వా | 2 ల | | 3 క | | 4 సు | ధ |
| | జ్జ | | రు | | త | |
| | | 5 ప | ణ | 6 ము | | |
| 7 న | ర్మ | ద | | 8 రా | బ | డి |
| | | 9 ఖి | 10 కా | రి | | |
| | 11 వై | | లు | | 12 వా | |
| 13 గా | రి | | డు | | 14 డ | ప్పు |

క్రొత్త చీట్లపేక ఒకటి తీసుకువచ్చి, అందులోని నాలుగు ఆసులనూ ముందుగానే తీసి హేట్ లోపలుండే లైనింగ్ క్లాత్ లోపల దాచాలి. తర్వాత పేకను ప్రేక్షకులలో ఒకరికి బాగా కలిపి ఇయ్యమని చెప్పి ఇవ్వాలి. ప్రేక్షకుడు పేకలో సహజంగా ఉండే యాభై రెండు ముక్కలకు నలభైయెనిమిది ముక్కలే కలుపుతాడే కాని ఏ ప్రేక్షకుడూ అందులో యాభైరెండు ముక్కలూ సరీగా ఉన్నాయా లేదా అని అంత శ్రద్ధగా చూడడు. అతడా పేకను బాగా కలిపి యిచ్చాక ఇంద్రజాలికుడు, టోపీలో యేమీ మాయ లేదని దాన్ని ప్రేక్షకులకు చూపాలి. లైనింగ్ క్లాత్ చాటున దాచిన ఆసులుమాత్రం ప్రేక్షకులకు కన్పించవు. కనుక ప్రేక్షకులు ఖాళీటోపీని మాత్రమే చూడకలుగుతారు. పేకముక్కలను టోపీలో వేసి మళ్ళీ గజిబిజిగా కలిపేసి, ఇంద్రజాలికుడి చేతికి టోపీని యివ్వాలి. ఇంకా బందోబస్తుగా ఉండాలంటే టోపీమీద ఒక జేబు రుమాలను కప్పి, ఇంద్రజాలికుడు కళ్ళకు గంతకూడా కట్టుకుని, జేబురుమాలక్రిందుగా చెయ్యిపోనిచ్చి నాలుగు ఆసులనూ బైటికి లాగవచ్చు.

పాఠకులు ఈ గారడీని ముందు యింటివద్ద అభ్యాసం చేసి, తర్వాతనే యితరులముందు చేసి చూపటం మంచిది. దీనిని చాకచక్యంగా మీరు ప్రదర్శించటంలోనే తమాషా అంతా ఆధారపడి ఉంటుంది.

---

పాఠకులు ఈ గారడిని గురించి యింకా విపులంగా తెలుసుకోదలిచితే, 'చందమామ' పేరు ఉదాహరిస్తూ ప్రొఫెసరుగారికి నేరుగా వ్రాయవచ్చు. మీరు రాసే ఉత్తరాలు ఇంగ్లీషులోనే వుండాలి. ఇది అతి ముఖ్యం. ప్రొఫెసరుగారి అడ్రసు యిది:

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్,
12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్, కలకత్తా - 19.






# రంగు వెయ్యండి—2-వ బొమ్మ కథ

ఆస్థానవిద్వాంసుడు మాంత్రికుని గ్రంథజాలమంతా అక్షరక్షరమూ పరిశీలిస్తూ పోగా పోగా, చివరకు ఎలాగైతేనేం ఆయన కృషి ఫలించింది. చిలుకను మనిషిగా మార్చే విధానాన్ని గురించి ఒక గ్రంథంలో యిలా వ్రాయబడివుంది:

"ఇక్కడకు ఈశాన్యదిక్కుగా నూరు యోజనాల దూరం ప్రయాణం చేస్తే ఒక పెద్ద పర్వతశ్రేణి వస్తుంది. మరో నూరు యోజనాలలో ఒక మహా సముద్రం వస్తుంది. దీనిని దాటి అవలి ఒడ్డుననున్న కీకారణ్యాలు దాటి మరొక నూరు యోజనాలు ప్రయాణం చేస్తే ఒక మంచుకొండ కన్పిస్తుంది. ఆ కొండపైన ఒక భవనం వుంటుంది. భవనంలో ఒక మహానుభావుడుంటాడు. చిలుకను మనిషిగా మార్చే రహస్యం ఆ మహానుభావుడికే తెలుసు. అయితే ఒక్క అమావాస్యనాడు తప్ప మిగతా రోజుల్లో ఆయన మాట్లాడడు."

ఈ వివరాలన్నీ ఆస్థాన విద్వాంసుడు మహారాజుకి తెలియజేసి, "ఇన్ని కష్టాలతో కూడుకొన్న ఈపని సామాన్యులవల్ల కాదు. ప్రాణాలకు తెగించి బయలుదేర గల సాహసవంతుడు కావాలి" అన్నాడు. "దాని కేమున్నది. దేశదేశాలు చాటింపిద్దాం" అన్నాడు రాజు. అదేప్రకారం చాటింపించాడు. ఈ పని నెరవేర్చుకు రాగలవానికి తన అర్థరాజ్యం యివ్వటమేగాక తన కుమార్తెనిచ్చి వివాహం చేస్తానన్నాడు. ఈ చాటింపువిని దేశదేశాలనుండీ ఎందరెందరో శూరులూ, వీరులూ వచ్చారు. కాని భయంకరమైన ఆ వివరాలు విన్నదే వెనుదిరిగి వెళ్ళిపోయారు.

చివరకు సింహళదేశపు రాకుమారుడు సింహబలుడు "నేను సాధించుకు వస్తాను" అని విద్వాంసుని దీవన లందుకుని బయలుదేరాడు. అష్ట కష్టాలకోర్చి పోతున్నాడు; పర్వతశ్రేణిని దాటాడు. మహాసముద్రం దాటాడు. కీకారణ్యాలు దాటి ఒక నిర్జన ప్రదేశంగుండా సాగిపోతున్నాడు. పున్నమి, అమావాస్యలు వస్తున్నయ్ పోతున్నై. ఎంతకూ మంచుకొండ జాడ కనిపించలేదు. ధైర్యం విడువక అలా పోయిపోయి ఎలాగైతేనేం మంచుకొండ చేరుకున్నాడు. కొండపైన భవనంచూచి రాకుమారుడు ఉప్పొంగిపోయాడు. ఐతే మేఘమండలాన్ని అంటుతున్న ఆ కొండ ఎక్కటం మాటలా? అదీగాక ఆ మరునాడే అమావాస్య. ఆ ఒక్కరోజులో భవనం చేరుకోవాలి. లేదా యిన్నాళ్ళు పడిన శ్రమ అంతా వృథా అయిపోతుంది. రాకుమారుడు మంచుకొండ ఎక్కటం ప్రారంభించాడు. పాపం, నున్నని ఆ మంచుగడ్డల పైన అడుగు ముందుకు పడటం అసాధ్యంగావుంది. అయినా అలా నిబ్బరంగా ఎక్కుతూనే ఉన్నాడు. ఈలోగా అమావాస్య రానేవచ్చింది. పాడ్యమి గడియలు రాకముందే ఎలాగైనా భవనం చేరుకోవాలని రాకుమారుడు సాగిపోతున్నాడు.




రంగువెయ్యండి (కథ): 3-వ బొమ్మ

# అట్టమీది బొమ్మ

బావమరిది ఐన శ్రీకృష్ణునిచేత రుక్మి పరాభవింపబడిన సంగతి ఇదివరకు చదివే ఉన్నారు. ఇందువల్ల రుక్మికీ కృష్ణునకీ మధ్య బద్ధవైరం కలిగింది. కలగవచ్చు. కాని, రుక్మికి చెల్లెలైనటువంటి రుక్మిణిపైన ఉండే ప్రేమాభిమానాలు ఎక్కడికి పోతై? రుక్మికి రుక్మవతి అనే కూతురు, రుక్మిణికి ప్రద్యుమ్నుడు అనే కుమారుడు. ఉభయులకూ పెళ్లి అయింది. వారికి అనిరుద్ధుడనేవాడు పుట్టాడు.

అనిరుద్ధుడికి యుక్తవయస్సు రాగా రోచన అనే కన్యనిచ్చి వివాహం చేయటానికి అతివైభవమైన యేర్పాట్లు జరిగినై. కాళింగాది రాజులందరూ పెళ్లికి విచ్చేశారు. పెళ్లి సందడిలో పిన్నలందరూ వేడుకలందు మునిగి, సంతోషంతో మెలగుతున్నారు. పెద్దలుకూడా వారివారికి తగిన సరదాలు తీర్చుకొంటున్నారు.

ఈ సందర్భంలో 'బలరామునితో జూదం ఆడి గెలుచుకోగలవా?' అంటూ రుక్మిని హుషారు చేశారు కాళింగాది రాజులు. అతనికి ఆట తెలియకపోయినా 'సరే'నంటూ తయారయ్యాడు. మొదట వేసిన నూరు, వెయ్యి, పదివేలు పందెములు రుక్మే గెలుచుకున్నాడు. ఇది చూచి కాళింగుడు పకపక నవ్వి బలరాముణ్ణి పరిహసించాడు. బలరాముడు మండిపోయాడు. తరవాత పందెములో బలరాముడు లక్ష మాడలు గెలిచాడు. ఐనా, "నేనే గెలిచా'నంటూ రుక్మి బూకరించాడు. బలరాముడు క్రోధపూరితుడైనాడు. తరువాతి పందెములో బలరాముడు పదికోట్లు గెలిచాడు. ఐనా, 'నేనే గెలిచా'నని రుక్మి మళ్లీ డబాయించాడు. పైగా, 'కావాలంటే ఇక్కడి పెద్దల నడగవయ్యా!' అన్నాడు.

అంతలో "బలరాముడే గెలిచాడు. రుక్మిమాట బొంకు!" అని ఆకాశవాణి స్పష్టంగా పలికింది. ఐనా, రుక్మి లెక్కచేయలేదు. 'అయ్యా! మీరు అడవులు తిరిగే గోపాలురు కాని అక్షవిద్యలో ప్రవీణులు కారు' అని బలదేవుని వేళాకోళం చేశాడు. కూడాఉన్న రాజులున్నూ ఈ మాటకు తాళం వేశారు.

అప్పుడు బలరాముడు ఉగ్రనరసింహమూర్తియై, ఒక్కదెబ్బకు లాఠితో రుక్మిని చంపివేసి, పారిపోతున్న కాళింగుణ్ణి పది అడుగులలో పట్టుకుని, ఏపళ్లు బైటబెట్టి తనను పరిహసించాడో, ఆ పళ్లు పటపట విరిగేటట్టు రాలగొట్టాడు. మిగిలిన రాజులు బలరాముని ధాకకు ఆగలేక కాలికొద్దీ పరుగుచ్చుకున్నారు.




## చందమామ
## చందాదారులకు మనవి

చందమామ ప్రతినెల, గతనెలాఖరులోనే చందాదారులకు పోస్టు చేయబడును. కాపీ చేరనిఎడల మొదటి అరుతారీఖుల లోగా తమ పోస్టాఫీసులో విచారించి, మాకు తెలియజేయాలి. 10 వ తారీఖు తరువాత వచ్చు కంప్లైంట్లు అమోదింప బడవు. గడచినమాసములలో చేరలేదనే కంప్లైంట్లు గమనింపబడవు.

Controlling Editor : SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press, Madras

